శ్రీమతే రామానుజాయ నమః



వాగమృతవర్షి, న్యాయవేదాంత విద్వాన్ ఉ.వే.శ్రీమాన్
వేళుక్కుడి వరదాచార్య స్వామివారు అనుగ్రహించిన

# వేదాలు - వేద వేద్యుడు



**అనువాదం:**

**పండితరత్న, సంత్సంప్రదాయసుధాంబుధి**

**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**

**సమర్పణము:**

**ఈయుణ్ణి అనంత రంగ రామన్**

**ఉ.వే.శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్యస్వామివారి**
**శతాబ్ది మహోత్సవ స్మృతి చిహ్నిక**

**29-01-2022**

# నివేదన

గడచిన శతాబ్దంలో ఆసేతుహిమాచలం తమ ఉపన్యాసామృతవర్షధారలతో సహృదయ శ్రోతల హృదయాలను రంజింపజేసిన మహోపన్యాసకులు, మహాపండితులు న్యాయ వేదాంత విద్వాన్ ఉ. వే. శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్య స్వామివారు. వీరి వాగమృతంలో తడవని రసజ్ఞులు ఆనాడు ఎవరూ లేరు అని అనడం అతిశయోక్తి కాదు. వీరు పరమపదించి ఇప్పటికి 32 సంవత్సరాలు పూర్తి అయినా, వీరి సూక్తులలోని మాధుర్యం ఈనాటికీ పలువురు పెద్దలకు గుర్తు ఉంటుంది. సంస్కృత, ద్రావిడ వేదాంత ప్రమాణాలను శరపరంపరగా గుప్పిస్తూ సాగే వీరి ఉపన్యాస శైలి వినేవారికి ఎంత ఆనందం కలిగించేదో, అంత ఆశ్చర్యం కూడా కలిగించేది. వారి సమయస్ఫూర్తి, ఎవరినీ నొప్పించని మృదువైన వాక్ శైలి, చిరునవ్వుతో తొణికిసలాడే ముఖం ఆజానుబాహువై చూసేవారి అందరినీ ఆకట్టుకునే నిండైన విగ్రహం - ఇవిఅన్నీ వీరికి ఒక్కసారి దర్శించినవారు ఎవ్వరూ కూడా మరువలేనివి.

శ్రీమాన్ వరదాచార్య స్వామివారి ఉపన్యాసాలను వారి శిష్యులు, అభిమానులు వారు ఉపన్యాసాలను అనుగ్రహించిన సమయంలో రికార్డు చేసి క్యాసెట్ల రూపంలో భద్రపరిచారు. వాటిలో కొన్నిటిని తరువాత అక్షరరూపంగా ముద్రించారు కూడా. ఆవిధంగా ముద్రింపబడిన స్వామివారి ఉపన్యాసాలలో ''వేదాలు వేదవేద్యుడు'' అనే తమిళోపన్యాసగ్రంథం ఒకటి.

శ్రీవరదాచార్య స్వామివారు మకర మాసం విశాఖ నక్షత్రంలో అవతరించారు. వారు అవతరించి ఇప్పటికి నూట ఒక్క సంవత్సరాలు పూర్తి అయినది. గత సంవత్సరం పలుచోట్ల వారి శతాబ్దిపూర్త్యుత్సవాలు

వైభవంగా జరుపబడ్డాయి.

ఆ మహనీయుల శతాబ్ది పూర్త్యుత్సవాలు జరిగే ఈసందర్భాన్ని పురస్కరించుకొని, తమిళంలో వారు అనుగ్రహించిన "వేదాలు వేదవేద్యుడు" అనే వారి ఉపన్యాసరూపమైన గ్రంథానికి తెలుగులో అనువాదం ప్రపన్నలోకానికి సమర్పింపబడుతున్నది. ఇది ఆ మహనీయుల విషయంలో భక్తిశ్రద్ధలతో దాసుడు సమర్పించే చిరు వాచికకైంకర్యం. స్వస్తి.

భవదీయుడు

**శింగరాచార్యులు**





దీవ్యద్ద్వాదశపుండ్రభూషితతనుచ్ఛాయాజితాహస్కరో

వాక్ పీయూషసరిత్ ప్రవాహతతిభిః సంసిక్తవిజ్ఞాశయః,

స్వచ్ఛస్మేరవిదీపితాననహరద్ధౌతాంశుబింబస్మయః

సోఽయం శ్రీవరదాఖ్యదేశికవరో జేజీయతాం సంతతమ్.

(ప్రకాశించే ద్వాదశోర్ధ్వ పుండ్రాలతో అలంకరింపబడిన తమ దేహంలోని కాంతితో సూర్యుని జయించినవారు, తమ సూక్తులనే అమృతనదీ ప్రవాహాల సమూహాలతో విజ్ఞుల హృదయాలను తడిపినవారు, స్వచ్ఛమైన చిరునవ్వుతో ప్రకాశించే ముఖంతో చంద్రబింబం గర్వాన్ని హరించినవారైన శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్యస్వామివారు ఎల్లప్పుడూ గొప్పగా వర్ధిల్లాలి.)

ఉ.వే.శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్య స్వామివారు అనుగ్రహించిన

# వేదాలు - వేద వేద్యుడు

మన సంప్రదాయంలో కృష్ణ త్రయమ్ అని ముగ్గురిని మనం ప్రధానంగా వ్యవహరిస్తున్నాము.

చేతనులను ఉద్ధరింపజేయడం కోసం భగవంతుడు ఎత్తిన అవతారాలలో చాల ముఖ్యమైనదిగా కీర్తింపబడేది - శ్రీకృష్ణావతారం. గీతాచార్యుడైన శ్రీకృష్ణ పరమాత్మ రూపమే పరమాత్మ అవతారాల రూపాలలో ప్రధానమైనది.

**సర్వోపనిషదోగావః దోగ్ధా గోపాల నందనః, పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్** (ఉపనిషత్తులన్నీ గోవులు. వాటిని పితికిన గోపాలుడు శ్రీకృష్ణుడు. లేగదూడ అర్జునుడు. గీత అనే అమృతమే గొప్ప పాలు. ఆ పాలను తాగేవాడు జ్ఞాని) అని చెప్పబడేటట్లు పరమవేదాంత సారభూతమైన భగవద్గీతను మనం ఆత్మ హితాన్ని పొందడం కోసం అనుగ్రహించిన వాడు శ్రీకృష్ణ భగవానుడు.

(వేదక్రమాలను పాడు చేయడం కోసం ఎత్తిన బుద్ధావతారం వలె కాకుండా) గీతలో తాను తెలిపే పరమార్థాలకు అన్నిటికి వేదాంత విషయాలనే మూలంగా ప్రధానంగా గ్రహించినవాడు.

వేద సంరక్షణం కోసమే, వేదార్థాలను సుస్థాపించడం కోసమే అవతరించినవాడు.

ఇతనికి తరువాత, ఈ శ్రీకృష్ణుని అంశావతార రూపుడైన కృష్ణద్వైపాయనుడనబడే వేదవ్యాస మహర్షిని రెండవ కృష్ణునిగా గ్రహించాలి.

**సహోవాచ వ్యాసః పారాశర్యః** (పరాశర మహర్షి పుత్రుడైన ఆ వ్యాసుడు పలికాడు) అని వేదమే ఇతనిని ప్రశంసించింది.

**పారాశర్య వచస్సుధామ్ ఉపనిషద్దుగ్ధాబ్ధి మధ్యోద్ధృతాం సంసారాగ్ని విదీపన వ్యపగత ప్రాణాత్మ సంజీవనీమ్, పూర్వాచార్య సురక్షితాం బహుమతి వ్యాఘాత దూర స్థితామ్ ఆనీతాం తు నిజాక్షరైః సమనసో భౌమాః పిబంత్వన్వహమ్** (ఉపనిషత్తులనే పాలకడలి మధ్య నుండి ఉద్ధరింపబడినది, సంసారమనే అగ్ని యొక్క నిరంతరమైన అవతారలలో (ఆత్మలైన తమకు కూడ ఆత్మయైన) పరమాత్మను చేరలేని జీవాత్మలను ఉజ్జీవింపజేసేది, పూర్వాచార్యులచే చక్కగా రక్షింపబడినది, పలు మతాలచే సమీచీనాలైన అర్థాలకు వ్యాఘాతం కల్గినందున వాటిలో అవగాహించడం దుర్లభమై, దూరంలోనే ఉన్నది, శ్రీభాష్యమనే అక్షరాలతో తమచే దగ్గరకు తీసికొని రాబడినది అయిన వ్యాసుని అమృతాన్ని ఈ లోకంలోని సూక్ష్మమైన జ్ఞానాన్ని కలవారు ప్రతిదినం ఆస్వాదించండి) అని శ్రీరామానుజులు ఈ వ్యాసమహర్షిని, వేదాంతానికి వ్యాఖ్యానంగా ఈ మహర్షి అనుగ్రహించిన బ్రహ్మసూత్రాలనే ప్రబంధాన్ని కీర్తించారు.

మహర్షులందరిలో మనకు పరమాప్తులై వెలిగేవారు ఈ వ్యాసమహర్షియే.

**ఆద్యస్య నః కులపతేః** (మనకు కులపతి, మొట్టమొదటివారు) అని ప్రపన్నజనకుల కూటస్థులుగా, **''కృష్ణత్వష్ణాతత్త్వమ్''** అని శ్లాఘించబడేవారైన నమ్మాళ్వార్లు పూర్వం ప్రస్తావించిన కృష్ణ - కృష్ణ ద్వైయపాయానులతో పాటు మనకు పరమాప్తులు.

**వేదమ్ తమిళ్శెయ్ద మాఱన్** (వేదాలను ద్రావిడీకరించిన మాఱన్) అనే ప్రసిద్ధి వీరికి ఉన్నది.

**మఱైప్పాఱ్కడలై తిరునావిన్ మన్దరత్తాల్ కడైన్దు,**

**తూత్రైప్పాల్ వడుత్తు త్తమిళ్ ఆయిరత్తిన్ శువై ఆయిరమ్, కట్రైప్పామ్బణ్ణైయానై పళ్ళియాన్ - అన్బర్ ఈట్టమ్ కళిత్తిరున్ద నిట్రైప్పాన్ కళలన్ఱి శన్మ విడాయ్క్కు నిళలిల్లైయ్** (వేదమనే క్షీరాబ్ధిని జిహ్వా అనే మందరంతో చిలికి, వడబోసి, ద్రావిడ భాషలోని తిరువాయ్ మొళి అనే వేయి తీయని పాశురాలను ఆదిశేషశయనుని భక్తుల సమూహం మిక్కిలిగా ఆనందించేటట్లు నిండించే (అనుగ్రహించే) నమ్మాళ్వార్ల శ్రీచరణాలు తప్ప, జన్మ అనే తృష్ణ తీరడానికి వేఱుచల్లని ఛాయ ఇంకొకటి లేదు) అని పలికేటట్లు, వేదాంతమనే క్షీరసాగరాన్ని చిలికి, తిరువాయ్ మొళి అనే భవామృతాన్ని మనం ఉజ్జీవించడం కోసం అనుగ్రహించారు.

వీరు అనుగ్రహించిన తిరువాయ్మొళి వేదంగా, వేదోపబృంహణంగాను కీర్తింపబడుతున్నది.

వేద వేద్యుడైన భగవానుడు, వైదికులైన శ్రీపారాశర్య మహర్షి, పరమవైదికులైన శ్రీపరాంకుశులు వేదాంత సారభూతమైన అర్థ విశేషాలను లోకంలో ప్రకాశింపజేయడం కోసమే అవతరించినవారు.

వేదాంత వాదాన్నే ప్రధానంగా కల్గిన తార్కిక మహాత్ములుగా వెలిగినవారు.

కృష్ణత్రయమనబడే ఈ ముగ్గురితో పాటు మనం ఇంకొక మహాచార్యుని కూడ చేర్చుకోవాలి.

భగవదవతార రూపాలలో శ్రీకృష్ణుని వలె, మహర్షులలో శ్రీకృష్ణ ద్వైపాయనుని వలె, ఆళ్వార్లలో శ్రీకృష్ణతృష్ణా తత్త్వమైన నమ్మాళ్వార్ల వలె, పూర్వాచార్యులలో శ్రీకృష్ణుని అవతార విశేషమై, కృష్ణ నామాన్నే కల్గిన వారైన శ్రీకృష్ణ సూరి అనబడే పెరియవాచ్చాన్ పిళ్ళై కూడ మనకు పరమాప్తులు.

పరమకారుణికులని పొగడబడే వీరు నల్గురు తమతమ సూక్తులతో పరమ వేదాంత సారరూపమైన అర్థ విశేషాలను మన కోసం అనుగ్రహించారు.

ఇటువంటి సారార్థాలలో ఒక అర్థాన్ని గూర్చి ఇపుడు యథామతి విన్నపిస్తాను.

**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంత కృత్ వేద విదేవ చాహమ్** (వేదాలన్నిటిచే నేనే పరతత్త్వంగా తెలియదగిన వాడను. వేదాంతాలను ఆవిర్భవింపజేసిన వాడను నేనే. వేదాలను తెలిసిన వాడను కూడ నేనే) అనేది గీతలో (15-15) భగవానుడు పల్కిన సూక్తి.

ఇక్కడ ఈ సూక్తిలో భగవానుడు **"వేదాంత కృత్"** అని తనను గూర్చి చెప్పుకొన్నాడు. **"వేదవిత్"** అని తనను గూర్చి చెప్పుకొన్నాడు. వేదవేద్యుడను నేనే అని తనను గూర్చి చెప్పుకొన్నాడు. **'వేదవిత్ వేదాంత విత్'** - వేదార్థాలను యధాతథంగా తెలిసిన వాడను - నేనే - అని పల్కుతున్నాడు, భగవానుడు.

వేదార్థాన్ని తెలిసిన వారు పలువురు ఆళ్వార్ల వంటి వారున్నారు కద! అంటే, వారికి కూడ ఆ జ్ఞానాన్ని కల్గించిన వాడు భగవానుడే.

భగవానుడు వేద వేద్యుడు. వేదార్థాన్ని తెలిసినవాడు మాత్రమే కాదు, వేదార్థమే తానై ఉండేవాడు.

వేదార్థంగా భగవానుడు తప్ప ఇంకెవ్వరు ఉండే అవకాశం లేదు.

వేదానికి అర్థంగా, వేదంచే తెలియబడేవాడుగా ఉండే వాడతడే - వేదవేద్యుడనబడుతున్నాడు.

**"వేదాంత కృత్"** - వేదాంతమైన (వేదవిధుల) ఫలాన్ని ఇచ్చేవాడు.

**"వేదాంతకృత్"** - అనే పదంలోని వేదాంత శబ్దం వేద శిరస్సులైన

ఉపనిషత్తులను తెలుపదు. వేదంలో విధివాక్యాలుగా ఉండేవి ఒక్కొక్కటి ఒక్కొక్క సాధనాన్ని గూర్చి పల్కి, దాని వల్ల లభించే ఫలాంశాన్ని తెల్పుతున్నాయి.

ఇక్కడ వేదాంతమనేది వేదంలో చెప్పబడిన యాగకర్మలకు అంతంగా - చివరగా ఉండే (కలిగే) ఫలాలను గూర్చి తెల్పుతుంది. అందువల్ల, వేద విధుల ఫలాలను ఇచ్చేవాడను నేనే - అని తనను గూర్చి భగవానుడే స్వయంగా పలికాడు.

వేదాంతమైన ఫలాన్ని ఇవ్వడానికి ఇక మఱెవ్వరికీ సాధ్యం కాదు. అతడొక్కడే ఫల ప్రదుడు.

ఈ వాస్తవాన్ని శ్రీవేదవ్యాస మహర్షి బ్రహ్మ సూత్రాలలో స్పష్టంగా పలికారు.

**ఫలమత ఉపపత్తేః** (3-2-37) (ఈ పరమ పురుషుని వల్లనే భోగమోక్షఫలాలు లభిస్తున్నాయి, అతనికే ఫలాన్ని ఇచ్చేవాడుగా ఉండే మహిమ పొసగి ఉన్నది కనుక) అనేది సూత్రం.

**స వా ఏష మహాన్ అజ ఆత్మాన్నాదో వసుదానః** (బృహ. 6-4-24) (పుట్టుక లేనివాడైన ఆ పరమాత్మ ఆనందాన్ని, ధనాన్ని ఇస్తున్నాడు) అనే వేదవాక్యం భగవానుడు భోగమోక్ష ఫలాలను రెండింటిని ఇచ్చేవాడు - అనేదానికి ప్రమాణం.

**ఏష హ్యేవానందయాతి** (తైత్తి-ఆనంద-7-1) (ఈ పరమపురుషుడే కద మోక్షానందాన్ని ఇచ్చేవాడు) అనే వాక్యం భగవానుడు మోక్ష ప్రదుడు - అనే దానికి ప్రమాణం.

ఈ విధంగా సకల ఫలప్రదుడు భగవానుడని తెలిపినట్లయినది.

పరమాత్మ అనుగ్రహ మూలంగానే ఫలాలన్నీ సిద్ధించాలి. ఎందుకంటే, **ఉపపత్తేః** - అతడు సర్వజ్ఞుడై, సర్వశక్తియై, ఫలప్రదుడై,

ఉదారుడై, కారుణికుడై, సత్యకాముడై, సత్యసంకల్పుడై ఉన్నందున - అని వేదవ్యాసుడు కారణాలను తెలిపారు.

భగవానునకు చెందిన మూడు విషయాలలో - అతడు వేద వేద్యుడని గ్రహించి ఆనందించడమే మనకు ప్రకృతంలో ముఖ్యమైన అంశం. అందువల్ల, ఈ సత్యాన్నే విషయంగా చేసికొని యధామతి విన్నపింపబడుతున్నది.

**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః** (అన్ని వేదాలచే తెలియబడేవాడను, నేనే) అనే వాక్యంలో భగవానుని అభిప్రాయనుగుణమైన అర్థాన్ని ఈ వచనంలో ఉండే **ఏవ**కారాన్ని

(1) **అహం వేద్యః ఏవ** (నేను తెలియబడేవాడనే),

(2) **సర్వైః వేదైః అహమేవ వేద్యః** (వేదాలన్నిటిచే నేనే తెలియబడుతున్నాను,)

(3) **అహం ఏవ వేద్యః** (నేనే - జగత్కారణంగా తెలియబడేవాడను) అని మూడు విధాలుగా అన్వయించి, అర్థాన్ని గ్రహించాలని మన పూర్వాచార్యులంటారు.

ఈ అర్థాలనే బ్రహ్మసూత్ర గ్రంథంలో వేదవ్యాసులు, తిరువాయ్‌మొழிలో నమ్మాழ்వార్లు ఏ విధంగా తెలియజేశారు - అనే విషయాన్ని వీటిని దృష్టిలో పెట్టుకొని శ్రీపరాశర భట్టర్ అనుగ్రహించిన ఒక ప్రసిద్ధ శ్లోకానికి అత్యద్భుతంగా, చాలా విపులంగా ఆవిర్భవించిన పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యానంలో కొన్ని అంశాలను ఇక మనం వివరంగా అనుభవిద్దాం.

1) బ్రహ్మసూత్ర ప్రబంధంలోని మొదటి అధికరణానికి జిజ్ఞాసాధికరణమని పేరు.

"అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" (అందువల్ల కర్మ విచారానంతరం

ఇకపై (బ్రహ్మను గూర్చిన విచారం చేయబడుతున్నది) అనేది అందులోని సూత్రం.

వేదాంతం బ్రహ్మాన్ని గూర్చిన ఆపాత ప్రతీతిని కల్గించదు. శబ్ద సామాన్యం సిద్ధార్థాన్ని (పూర్వమే సిద్ధించిన విషయాన్ని) తెలుపలేదు కనుక - అనేది ఈ ఆధికరణంలోని పూర్వ పక్షం.

ప్రాభాకర మీమాంసులు ఈ పూర్వ పక్షాన్ని వాదించే ప్రతివాదులు. శబ్ద వస్తువు వేదాంతం, సిద్ధవస్తువు - పరబ్రహ్మం. బ్రహ్మమనే సిద్ధ వస్తువును వేదాంతమనే శబ్దం బోధించదు. ఇందువల్ల బ్రహ్మ విచారం అనాదరణీయం - అని పూర్వ పక్షం.

శబ్దం సిద్ధ వస్తువునకు వాచకం కావచ్చు; శబ్దానికి సిద్ధ వస్తువును తెలుపడంలో సామార్థ్యం ఉన్నది అని నిరూపించి, ఈ పూర్వపక్షాన్ని వేదవ్యాసులు ఖండించారు. ఈ విధంగా **'బ్రహ్మం జిజ్ఞాస్యమ్'** అనే అర్థాన్ని తెలిపే రీతిలో జిజ్ఞాసాధికరణం ఉన్నది.

**అహమ్ వేద్యః ఏవ** (నేను తెలియబడే వాడనే) అనే భగవంతుని సూక్తిలో కూడ ఈ అర్థాన్ని మనం గ్రహించవచ్చు.

నమ్మాళ్వార్లు కూడ తిరువాయ్‌మొళిలో భగవానుని స్వరూప, రూప, గుణ, విభూతి, ఐశ్వరాదులను గూర్చి విస్తృతంగా నిరూపించడం ద్వారా "అతడు తెలియబడే వాడే" అనే అర్థాన్ని ప్రతిపాదించారు.

మొదటి పాశురంలోని మొదటి పాదంలోనే **ఉయర్వఱ ఉయర్ నలమ్ ఉడైయవన్ యవన్ అవన్** (నిస్సమాభ్యధికమైన ఆనందగుణాన్ని కల్గినవాడెవడో, అతడు) అని ఆళ్వార్లు పల్కిన సూక్తిని మనం గమనించవచ్చు.

**"యవన్"** (వేదాంతంచే తెలియబడే ప్రసిద్ధిని కలవాడు) అని నిర్దేశించడం ద్వారా **"అవన్"** (వేదాంతంచే) తెలియబడేవాడే - అనే

అర్థాన్ని స్పష్టంగా, దృఢంగా తెలిపారు.

**"యువన్ - ప్రమాణ ప్రసిద్ధ నానవన్ యావనొరువన్"** (ప్రమాణ ప్రసిద్ధుడైన వాడెవడో) అనేది పన్నిరాయిరప్పడి వ్యాఖ్యాన సూక్తి. **"యువన్" - "ఇగ్గుణఙ్గళుక్కు ఆశ్రయమాన దివ్యాత్మ స్వరూపత్తినుడైయ ప్రసిద్ధియైచ్చొల్లు కిఱదు"** - ఈ గుణాలకు ఆశ్రయమైన దివ్యాత్మ స్వరూపం యొక్క ప్రసిద్ధిని ఈ పదం తెల్పుతున్నది - అనేది ఇరురుపత్తునాలాయిరప్పడి వ్యాఖ్యాన సూక్తి.

బ్రహ్మం విషయంలో ఏది ప్రమాణం? అనే ప్రశ్నకు "బ్రహ్మ విషయంలో ప్రత్యక్షం కాని, అనుమానం కాని ప్రమాణం కాదు. శాస్త్రమే ప్రమాణం" - అనే అర్థాన్ని తెలుపడం కోసం శాస్త్ర యోనిత్వాధికరణం ఏర్పడింది.

**"శాస్త్రయోనిత్వాత్"** అనేది అందులోని సూత్రం. **"శాస్త్రైక ప్రమాణ త్వాత్"** - శాస్త్రం ఒక్కటే ప్రమాణం. వేద వేదాంతాలను ప్రమాణంగా కల్గిన గొప్పతత్త్వమే బ్రహ్మం. వేదైకసమధిగమ్యమై ఉ ండడమనేది బ్రహ్మానికి గల గొప్పతనం.

బ్రహ్మాన్ని గూర్చి తెలుపడంలో మూల ప్రమాణమై, నిత్య నిర్దోష ప్రమాణమై ఉండడం అనేది వేదానికి గల గొప్పతనం. ఈ అర్థాలనే **సర్వైః వేద్యః అహమేవ వేద్యః** (అన్ని వేదాలచే తెలియబడేవాడను నేనే) అని భగవానుడు పలికాడు.

నమ్మాళ్వార్లు **"అయర్వఱుమ్ అమరర్కళ్ అదిపతి"** అని అన్నారు. "అమరులకు పతి" అని అంటేనే చాలి ఉండగా, ఇక్కడ "అధిపతి" అని ఎందుకు అన్నారు? - అనే సందేహానికి అత్యద్భుతమైన సమాధానాన్ని మన పూర్వాచార్యులు పలికారు. "అదిపతి" అంటే - **"అధికః పతిః"** (చాలా గొప్పవాడు) అని అర్థం.

చాలా గొప్పవాడంటే భావమేమి? చాలా గొప్పవాడంటే అపరిచ్ఛేద్యుడై ఉండే వాడని అర్థం. అభిన్న నిమిత్తోపాదాన కారణమై ఉండేవాడు అని అర్థం.

ఈ విధంగా, నిమిత్త కారణమై ఉండడమే కాక, అతడు ఉపాదాన కారణంగా కూడ ఉన్నాడు - అని అన్నందున, అతనిని ఆళ్వార్లు "అధిపతి" అని అన్నారని ఏర్పడింది.

ఈ వాస్తవాన్ని మనం శాస్త్రం మూలంగానే తెలియగలం కనుక, శాస్త్రయోనిత్వాధికరణాన్ని ఈ విధంగా సూచించారు, ఆళ్వార్లు - అని మనం తెలియవచ్చు. ఈ అర్థాన్ని మనస్సులో పెట్టుకున్న శ్రీపరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవంలో-

**ఆదౌవేదాః ప్రమాణం స్మృతిరుపకురుతే సేతిహాసైః పురాణైః న్యాయైస్సార్థం త్వదర్చావిధిముపరి క్షీయతే పూర్వభాగః। ఉర్ధ్వోభాగః త్వదీహాగుణవిభవ పరిజ్ఞానవైస్త్వత్పదాప్తౌ వేద్యోవేదైశ్చ సర్వైరహమితి భగవన్! స్వేన చ వ్యాచకర్థ॥**

(భగవన్! వేదాలు మొట్టమొదటి ప్రమాణం. స్మృతులు, ఇతిహాసాలతో కూడిన పురాణాలు, పూర్వ మీమాంసా న్యాయాలు, ఉత్తర మీమాంసా న్యాయాలు ఈ వేద వాక్యాలకు అర్థ నిర్ణయంచేయడంలో సహాయపడతాయి.

కర్మ కాండం - అనబడే వేదం (పూర్వభాగం) నీ ఆరాధనా ప్రకారాలను గూర్చి తెల్పుతున్నది.

ఉత్తర భాగమనే బ్రహ్మకాండం నీ గుణాలను చేష్టితాలను, విభూతులను గూర్చి తెల్పుతున్నది.

కర్మకాండలో చెప్పబడిన నీ ఆరాధనా రూపమైన కర్మలు, బ్రహ్మకాండంలో చెప్పబడిన నీకు చెందిన జ్ఞానం అన్నా (సంసారి

చేతనులను) నీ సన్నిధిని చేర్చడంలోనే ఉద్దేశ్యాన్ని కల్గినవై ఉన్నాయి. "అన్ని వేదాలచే నేనే తెలియబడుతున్నాను-" అని నీవు కూడ స్వయంగా పలికావు కద) అనే శ్లోకం ద్వారా భగవత్సన్నిధిలో విన్నపించారు. భారతాది తనిశ్లోక వ్యాఖ్యానం గ్రంథంలో ఈ శ్లోకంలో తెలుపబడే అర్థాలను అపారంగా శ్రీపెరియావాచ్చాన్ పిళ్ళై వర్ణించారు.

ఈశ్వరుడు (బ్రహ్మం) - అనుమాన ప్రమాణంతో సిద్ధించేవాడు - అని వాదించే ప్రతివాదిని ప్రతిపక్షిగా చేస్తూ, సపరికరమైన, కృత్స్నమైన వేదమే ఈ విషయంలో ప్రమాణమని, పూర్వోత్తర భాగాలు రెండింటిలోను అతడే ప్రతిపాద్యుడని పల్కి, ఈ అర్థంలో శ్రీ గీతలో భగవానుడు పల్కిన వచనాన్ని ఉదాహరిస్తారు - అని భట్టర్ రచించిన ఈ శ్లోకానికి వ్యాఖ్యానావతారికను శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించారు.

ఇక్కడ, 1) వేదం భగవానుని గూర్చి తెల్పుతున్నది. 2) వేదం ఏ విధంగా తెల్పుతున్నది?, 3) వేదం భగవానుని తెలియజేయడం వల్ల కలిగే ప్రయోజనమేమి? అనే మూడు ముఖ్యమైన విషయాలను పరాశరభట్టర్ దృష్టిలో పెట్టుకొన్నారు.

వేదం భగవానుని తెల్పుతున్నదని ఏ విధంగా చెప్పగలం? వేద శిరస్సు అయిన వేదాంతం పరబ్రహ్మాన్ని గూర్చి తెల్పుతున్నదని అంటే అనవచ్చు. అయితే, యాగాది కర్మలను గూర్చి తెలిపే పూర్వభాగం, బ్రహ్మాన్ని గూర్చి తెల్పుతున్నదని అనడం ఏ విధంగా? అనేది ఇక్కడ కలిగే సందేహం. దీనిని గూర్చి తరువాత వివరింపబడుతుంది.

వేదం ఏ విధంగా భగవానుని తెల్పుతున్నది? వేదం భగవానుని జగత్కారణంగా, జగదేక కారణంగా, చిదచిద్వి లక్షణ కారణంగా, అఖిల కారణంగా, అద్భుత కారణంగా, నిష్కారణునిగా తెల్పుతున్నది. బ్రహ్మాన్ని గూర్చిన ఈ సత్యాలను మనం వేద - వేదాంగాలను

పురస్కరించుకొనే తెలియగలం. దీనిని గూర్చి కూడ తరువాత వివరిస్తాను.

వేద - వేదాంగాలు ఈ విధంగా భగవానుని గూర్చి తెలుపడంలోని ప్రయోజనమేమి? సర్వకర్మ సమారాధ్యుడై, సర్వ దేవతాంతరాత్మయై ఉండే భగవానుడు వేదాలలోని పూర్వభాగంలో చెప్పబడిన కర్మలతో సంతోషిస్తాడు.

ఉత్తరభాగంలో చెప్పబడిన జ్ఞానానికి అనుగుణంగా అతడు అనుగ్రహాన్ని వర్షించగా, జీవాత్మ మోక్షానందాన్ని పొందుతున్నాడు.

కర్మకాండం, జ్ఞానకాండం అని విభాగింపబడిన, మోక్ష శాస్త్రమైన ఈ వేదానికి గల ప్రయోజనం ఇదే. దీనిని గూర్చి కూడ తరువాత వివరంగా తెలుపబడుతుంది.

ఈ విధంగా ఈ మూడు వాస్తవాలను నిరూపించే రీతిలో ఈ శ్లోకం అనుగ్రహింపబడింది - అనేది ఇక్కడ మనం చాల ముఖ్యంగా తెలియవలసిన అంశం.

బ్రహ్మం విషయంలో వేదమే ప్రమాణం - అని శాస్త్రయోనిత్వాధికరణంలో శ్రీవేదవ్యాస మహర్షిచే నిశ్చయించబడిన అర్థాన్నే నమ్మాళ్వార్లు వేరొక చోట **"అటిన్దన వేదమ్'** (9-3-3) అని తెలియ జేశారు. ఈ అర్థాన్ని మనస్సులో పెట్టుకొని శ్రీపరాశర భట్టర్ **"ఆదౌ వేదాః ప్రమాణమ్"** అని అనుగ్రహించారు.

భగవానుని గూర్చి తెలుపడంలో 1) వేదం ప్రమాణమని, 2) వేదం మూల ప్రమాణం, దృఢ ప్రమాణం, నిత్యనిర్దోష ప్రమాణం అని, 3) వేదం అంతా ప్రమాణం - అని, 4) వేదమే ప్రమాణమని, 5) ఈ విధంగా వేద ప్రామాణ్యాన్ని అంగీకరించని మతాలు నిరసింపబడ్డారు - అని దీని ద్వారా తెల్పుతున్నారు. తరువాత, **స్మృతి రువకురుతే గీతహాసైః పురాణైః, న్యాయైస్సార్థమ్** అనే శ్రీ సూక్తి ద్వారా 6)

సపరికరమైన (సాంగమైన) వేదమే ప్రమాణమని నిరూపిస్తున్నారు.

పరమాత్మ విషయంలో వేదం ప్రమాణం అంటే ఏమి? - వేదాన్ని పురస్కరించుకొని పరమాత్మను గూర్చి తెలిసికోవాలి - అని అర్థం.

పరమాత్మ విషయంలో వేదాన్నే ప్రమాణంగా అంగీకరించాలి. నమ్మాళ్వార్లు భగవానుని **"కరనే"** (1-1-10) అని అన్నారు. **"కరన్"** అనే దానికి **"దృఢన్- దార్ఢ్యముడైయవన్"** (దృఢమైన వాడు - దార్ఢ్యాన్ని కలవాడు) అనేది - అర్థం.

అయితే, ఇక్కడ భగవానుని దార్ఢ్యం చెప్పబడలేదు. **"సుదృఢ ప్రమాణసిద్ధన్"** (చాలా దృఢమైన వేదమనే ప్రమాణం చేత సిద్ధించినవాడు) అనేది వ్యాఖ్యానం. అతనిని తెలిపే ప్రమాణం దృఢమైనది - అనే దానిని ఆళ్వార్ల మనోగతమైన అభిప్రాయంగా ఇక్కడ మన పూర్వాచార్యులు గ్రహించారు. దృఢ ప్రమాణసిద్ధుడైన భగవానునకు దార్ఢ్యాన్ని చెప్పడం కూడ తగినదే.

ఆణ్డాళ్ (గోదాదేవి) **"ఊఱ్ఱముడైయాయ్"** అని అన్నారు. ఇక్కడ **"ప్రమాణ దార్ఢ్యత్తాల్ వన్ద ప్రమేయసిద్ధినుడైయస్థైర్య త్తైచ్చొల్లుకిఱదు. పురుషబుద్ధి ప్రభవఙ్గళానవఱ్ఱాలన్రిక్కే, అపౌరుషేయుమాయ్, నిత్య నిర్దోషమాన వేదత్తాలే ప్రతిపాదిక్కప్పడుకైయాలే దృఢ ప్రమాణ సిద్ధనాయిరుక్కై. అప్రమాణ మెన్నుదల్, అనుమాన ప్రమాణ మెన్నుదల్ శెయ్యవొణ్ణాదు, వచనాభాసఙ్గళులుమ్, ఉక్త్యా భావఙ్గళులుమ్ అటిక్కవొణ్ణాదా యిరుక్కై"** (ప్రమాణంలోని దృఢత్వం వలన కలిగే ప్రమేయ సిద్ధిలోని దృఢత్వం ఇక్కడ చెప్పబడుతున్నది. పురుష బుద్ధి వల్ల ఏర్పడే వాటి ద్వారా కాకుండా, అపౌరుషేయమై, నిత్యమై, నిర్దోషమైన వేదంచే ప్రతిపాదింపబడుతున్నందున, దృఢ ప్రమాణం చేత సిద్ధించేవాడై భగవానుడున్నాడు. అప్రమాణమని అనడం గాని, అనుమానం చేత

ప్రమాణమని అనడం కాని వీలుకాదు. వచనాభాసలతో, ఆభాసయుక్తులతో కాదని అనడానికి వీలులేనిదై ఉండడం) అని నాయనార్ వ్యాఖ్యానించారు.

భగవానుని గూర్చి తెలిపే వేదం దృఢమైన ప్రమాణం. దృఢ ప్రమాణమైన వేదాలచే కీర్తింపబడే గొప్పతనాన్ని కలవానిని **"ఊఱ్ఱముడైయాయ్!"** అని గోదాదేవి సంబోధిస్తున్నారు.

నైయాయికులు ఈశ్వరసత్తను వేదంతో సాధించరు. వారు అనుమానం ద్వారానే ఈశ్వర తత్త్వాన్ని స్థాపిస్తారు.

కొందరికి అనుమాన ప్రమాణం పట్ల మిక్కిలి ఆదరం ఉంటుంది. ఇటువంటి వారు దేనిని అయినా అనుమానంతోనే స్థాపించాలని భావిస్తారు.

పర్వతం, దానిపైన పొగ కంటికి కన్పిస్తాయి. "పర్వతంపై నిప్పు ఉన్నది, పొగ కన్పడుతున్నందున'' అని కంటికి కన్పించే పొగను పురస్కరించుకొని కంటికి కన్పించని నిప్పును ఊహించి తెలియడమే అనుమానం. ఈ రీతిలోనే భగవానుని సత్తను వీరు సాధిస్తారు.

ఘటానికి కారణం కుమ్మరి వాడు, కుమ్మరిచే నిర్మింపబడకపోతే ఘటం పుట్టదు, ఈ విధంగానే జగత్తుకు కారణంగా ఈశ్వరుడున్నాడు - అని వీరంటారు. "అనుమానంతో ఈశ్వరుని సాధించడం వీలుకాదు'' అని వీరి పక్షాన్ని వ్యాసమహర్షి ఖండించారు.

ఘటానికి ఈశ్వరుడు వలె, జగత్తుకు ఈశ్వరుడు కారణం అంటే, ఈ విధంగా అనుమాన ప్రమాణం ద్వారా సాధింపబడే వ్యక్తి విశేషం ఈశ్వరుడు కాబోడు. కుమ్మరి వాని వలెనే అతడు కూడ ఒక జీవాత్మయే అని సిద్ధిస్తాడు.

కుమ్మరి వానికి వలె అతనికి కూడ సంసారం, అజ్ఞానం, అశక్తి,

దుఃఖం ఇత్యాదులను ఒప్పుకోవలసి వస్తుంది. వేదాంతాలలో కీర్తింపబడిన పరబ్రహ్మానికి కల ఆనందం మొదలైన గొప్పతనాలు ఏవీ అనుమానం ద్వారా సిద్ధించవు. అల్పమైన ఘటానికి అల్ప జ్ఞాన శక్తులను కల కుమ్మరి వాడు కారణం. విచిత్రమైన, గొప్పదైన జగత్తుకు గొప్ప జ్ఞాన శక్తులను కల ఈశ్వరుడు కారణం.

ఈ విధంగా ఉండే భగవానుని మహిమను అనుమానంతోనే సాధించవచ్చు - అని ఇంకా వాదిస్తారు, వీరు. అయితే, ఈ విధంగా కూడ వీరు వాదించడానికి సాధ్యం కాదని అంటారు, వ్యాసమహర్షి.

అనుమానంతోనే ఈశ్వరుని స్థాపించాలని ప్రయత్నిస్తే, తర్క శాస్త్రంలో మిక్కిలి సమర్థుడైన వాడొకడు ఈ తర్కాన్ని పురస్కరించుకొనే "ఈశ్వరుడు లేడు" అని వాదించి సిద్ధాంతం చేయవచ్చు.

**"తర్కా ప్రతిష్ఠానాత్"** అని అంటారు, వ్యాసుల వారు. ఇంతే కాదు ఘటానికి కుమ్మరి నిమిత్త కారణమైనట్లు, జగత్తుకు పరమాత్మను నిమిత్త కారణంగా మాత్రమే నిరూపించ సాధ్యమవుతుంది.

వేదాంతాల ద్వారానే మనం ఈశ్వరుని గూర్చి తెలియడానికి వీలవుతుంది. శాస్త్రాలను పురస్కరించుకొనే మనం పరమాత్మను జగత్తుకు త్రివిధ కారణంగా తెలియగలం.

ఘటానికి కుమ్మరి వలె, జగత్తుకు ఈశ్వరుడు అనేది మాత్రమే కాదు; ఘటానికి కుమ్మరి కేవలం నిమిత్త కారణం. ఘటానికి అతడు ఉపాదాన కారణం కాలేడు. ఉపాదాన కారణమంటే ఏమి? అంటే, ఏ ద్రవ్యం కారణమై ఉండి, కార్యంగా మారుతున్నదో, ఆ ద్రవ్యం ఉపాదాన కారణమనబడుతుంది. మట్టితో నిర్మింపబడిన ఘటానికి మట్టి ఉపాదాన కారణమవుతుంది. బంగారంతో చేయబడిన నగలకు బంగారం ఉపాదాన కారణమవుతుంది.

ఈ విధంగానే, జగత్తుకు పరమాత్మ నిమిత్త కారణంగా, ఉపాదాన కారణంగా, సహపరివారణంగా ఉన్నాడు - అనేది వేదాంతాల పరమాశయం - అని వేద వ్యాసులు తెలిపారు. ఈ సత్యాన్ని మనం అనుమానం ద్వారా తెలియలేము. శాస్త్రం ద్వారానే తెలియడానికి సాధ్యం.

భగవానుడు జగత్తుకు త్రివిధ కారణంగా ఉన్నాడు - అనే దానిని నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళ్లిలో **"వేర్ ముదలాయ్ విత్తాయ్"** (2-8-10) అని, **"ముదల్ తనివిత్తేయో"** (10-10-9) అని తెలిపారు.

జగత్తుకు భగవానుడు వేరుగా, మొదలుగా, విత్తుగా ఉన్నాడు. వేరు అన్నా కారణం, మొదలు అన్నా కారణం, విత్తు అన్నా కారణమే. కారణమనే ఒకే అర్థానికి నమ్మాళ్వార్లు మూడు శబ్దాలను పల్కడం - అతడు జగత్తుకు త్రివిధకారణమై ఉన్నందు వల్లనే - అనే విషయాన్ని మనం తెలియగలం.

ఇంతేకాదు. ఈశ్వరుడు తనకు వేరొక కారణాన్ని కలవాడుగా లేడు. మనకు మన తండ్రి కారణం. మన తండ్రికి తాత కారణం. అందరికి చతుర్ముఖ బ్రహ్మ కారణం. ఆ బ్రహ్మకు భగవానుడు కారణం.

భగవానునకు ఎవరు కారణం? అంటే, అతనికి అతడే కారణం. తనకు ఇంకొక కారణం లేనందువల్ల "నిష్కారణమ్" అని కీర్తింపబడుతున్నాడతడు. కులశేఖరాళ్వార్ల ఆశ్చర్యకరమైన అనుభవం ఒకటి ఉన్నది.

**మున్నైనన్ ముఱైయున్ వుడైమకళిర్ ముఱైముఱై తన్దమ్ కుఱజ్గిడైయిరుత్తి**

**ఎన్నైయే! ఎన్దన్ కులప్పెరుమ్ శుడరే! ఎళ్లుముకిల్ కణత్తెళ్లిల్‌కవరేఱే!**

**ఉన్నైయావన్? ఎన్నురైప్ప నిన్ శేజ్గేళ్ విరలినుమ్ కడైక్కణ్ణినుమ్**

కాట్టు

నన్దన్ పెత్ఱనన్ నల్ వినైయిల్లా నఙ్గళ్ కోన్ వశుదేవన్ పెత్ఱిలనే

(పెరుమాళ్ తిరుమొழి 7-3)

రేపల్లెలో శ్రీకృష్ణుడు అవతరించాడు. ఎవరైనా ఒక బాలుడు చాల అందంగా ఉంటే, చుట్టు పక్కల ఉండేవారు అందఱు ఆ బాలుని ఎత్తుకొని లాలిస్తారు. శ్రీకృష్ణుని సౌందర్యం, సౌకుమార్యం, లావణ్యం అంతా రేపల్లెలోని గోపికలందరికి అనుభావ్యాలే.

ఒక నిముషానికి ఒక గోపిక చొప్పున అందఱు మార్చి మార్చి తమతమ ఒడిలో ఎత్తుకొని పెట్టుకొని లాలిస్తున్నారు. వారిలో ఒక గోపిక శ్రీకృష్ణుని తన ఒడిలో పెట్టుకొని "నీ తండ్రి ఎవరు?" అని అడిగింది.

భగవంతుడు ఆలోచించాడు. అందరికీ తండ్రిగా నన్ను వేదాంతం కీర్తిస్తున్నదే! వీరు నన్ను "నీ తండ్రి ఎవరు?" అని అడుగుతున్నారు. "నాకు తండ్రి ఎవరు లేరు" అని అనాలని ప్రయత్నించాడు. "అయినా, ఈ నందగోపాలుని తండ్రిగా ఆశపడి, రేపల్లెలో శ్రీకృష్ణునిగా వచ్చి పుట్టాను కద!" - అని ఆలోచించి, "పిల్లా! ఆ స్తంభం దగ్గర ఉన్నారే! ఆయనే నా తండ్రి" అని అనాలని ఆరంభించబోయాడు.

వెంటనే అతని మనస్సులో "నేను పుట్టి ఇంకా నాల్గు నెలలు కూడ కాలేదే! ఏవిధంగా మాటలాడడం!" అని తోచింది. పలకాలని తెఱచిన నోటిని వెంటనే మూసికొని, తన చేతి వేళ్ళతోను, కన్నులతోను సైగ చేసి, నందగోపాలుని తన తండ్రిగా చూపించాడు.

"ఇన్నాళ్ళ తరువాత బిడ్డ పుట్టడంలో ఆశ్చర్యం లేదు. పరమ సుందరమూర్తిగా బిడ్డ పుట్టడంలోనూ ఆశ్చర్యం లేదు. ఈ బాలుడు ఇంతలోగానే నన్ను తండ్రిగా చూపించాడే!" అని నంద గోపాలునకు

చాల సంతోషం కల్గింది.

దీనిని చూచి భగవానుడు చిఱునవ్వు నవ్వాడు. ఏమి అర్థం దానికి? సర్వలోక మహేశ్వరుడై లోకానికి అద్వితీయ ప్రాణమై; అందఱికి తండ్రియైన భగవానునకు నంద గోపాలుడు తండ్రియా! కారణాల కన్నిటికీ పరమకారణమై, ఈశ్వరులకందరికీ పరమేశ్వరుడై, శేషియైన వారికందరికి పరమ శేషియైనవాడు కద భగవానుడు.

**"వేణ్డిత్తేవర్ ఇరక్కవన్దు పిఱన్దాన్"** (దేవతలు కోరి ప్రార్థించగా ఈ లోకానికి వచ్చి జన్మించాడు.) అని అన్నారు, ఆళ్వార్లు.

దేవతల కోరికను తీర్చడం కోసం మాత్రమే భగవానుడు అవతరించలేదు. తనకు తండ్రి ఎవరూ లేరే! - అనే కొఱతను తీర్చుకోవడం కోసం కూడ అవతరించాడతడు - అని మన పూర్వాచార్యులంటారు. ఈ విధంగా, అఖిల కారణుడైన, అద్భుత కారణుడైన, నిష్కారుణుడైన భగవానుడు తన బిడ్డల మధ్య ఒక బిడ్డను తనకు తండ్రిగా వర్తిస్తున్నాడు. భగవానుడు వసుదేవునకు తండ్రియా? అంటే, శ్రీకృష్ణుడే వసుదేవునకు తండ్రి - అని వేదాంతులంటారు. **"పితాపుత్రేణ పితృమాన్ యోనియోనౌ"** (యజు-కారకమ్- 3-9-55) (సర్వలోక జనకుడైన భగవానుడు తన కుమారులలో ఒకనిని తండ్రిగా గ్రహించి ప్రతి జన్మలో జన్మిస్తున్నాడు) అని శ్రుతివాక్యం. వసుదేవుని శ్రీకృష్ణునకు తండ్రిగా పౌరాణికులు పల్కుతున్నారు. ఏది నిజం? భగవదవతారాలు సత్యమైనవి కనుక రెండూ వాస్తవాలే.

**"ఉళన్ శుడర్ మికుశురుదియుళ్"** (తిరువాయ్ మొழி (1-1-7) (మిక్కిలిగా ప్రకాశించే వేదాలలో ఉన్నాడు) అని ఆళ్వార్లు అన్నారు.

ఇక్కడ "స్మృతీతిహాస పురాణోప బృంహితమై, అపౌరుషేయమైనందున నిర్దోషమై, అబాధిత ప్రామాణ్యా రూపమైన తేజః

ప్రాచుర్యాన్ని కల్గినదైన శ్రుతులలో ఉన్నాడు - అని అంటున్నారు.

అందువల్ల, లోకాయత భాస్కరీయ యాదవ ప్రకాశాది వేద విరుద్ధాలైన మతాలన్నీ నిరస్తాలైనవి) **(స్మృతీతిహాస పురాణోప బృంహితమాయ్, అపౌరుషేయమాకైయాలే నిర్దోషమాయ్, అబాధిత ప్రామాణ్య రూప తేజః ప్రచురమాయిరున్ద శ్రుతికళిలే ఉళన్ - ఎన్గిఱార్. ఆదలాల్ లోకాయత మాయావాద భాస్కరీయ యాదవ ప్రకాశాది వేద విరుద్ధ సమయఙ్గళెల్లామ్ నిరస్తఙ్గళ్")** అనేది ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం.

**"ముదఱ్పాట్టుత్తొడఙ్గిచ్చొన్న అర్థఙ్గళ్ ఎల్లావఱ్ఱుక్కుమ్ ప్రమాణమ్ నిర్దోష శ్రుతి - ఎన్గిఱదు. శుడర్ మికుకైయావదు - పౌరుషేయత్వ నిబంధనమాన విప్రలంభాది దోషరహితము మాయ్, ప్రమాణాంతరఙ్గళై క్కొణ్డు బాహ్య కుదృష్టికళాల్ అవిచాల్యమాకైయాలే మిక్క తేజస్సై ఉడైత్తాకై. ఒరుత్తరాల్ పణ్ణప్పట్టిదన్ఱిక్కే ఎన్ఱుమ్ కేట్టే వరుమదాకైయాలే శ్రుతి ఎన్గిఱదు. (ఉళన్) ఇప్పడిప్పట్ట శ్రుతియిలే ప్రతిపాద్య నాయ్క్కొణ్డు తోన్ఱినవన్. తామ్ అనుసంధిత్త అర్థఙ్గళుక్కు శ్రుతియై సాక్షియాక చ్చొల్లుకైయాలే, అదిల్ శొల్లుకిఱ శ్రియఃపతిత్వముమ్, నారాయణ శబ్ద వాచ్యత్వముమ్ అనుసంధిత్తారాక వేణుమ్. ఇవర్క్కు నిర్దోషశ్రుతియే ప్రమాణమాకైయాలే బాహ్యరుమ్, జగదీశ్వరర్కళు క్కు అన్యథా సంబంధమ్ శొల్లుకిఱ కుదృష్టికళుమ్, అర్థాత్ ప్రతిక్షిప్తఙ్గళ్"** (మొదటి పాశురం నుండి ఆరంభించి పల్కిన అర్థాలకు అన్నిటికి ప్రమాణం - నిర్దోష శ్రుతి - అని అంటున్నారు. శ్రుతి మిక్కిలిగా ప్రకాశించడం అంటే - పౌరుషేయత్వం వల్ల ఒక పురుషునిచే నిర్మింపబడడం వల్ల ఏర్పడే విప్రలంభాది దోషాలు ఏమీలేనిదై, వేఱు ప్రమాణాలతో బాహ్య కుదృష్టి వాదులచే కదపడానికి వీలులేనిదై ఉన్నందున, గొప్ప తేజస్సును కల్గినదై ఉండడం. ఒకరిచే నిర్మింపబడినది

కాకుండా, ఎల్లప్పుడు కర్ణ పరంపరగా శ్రూయమాణమవుతున్నందున శ్రుతి అనబడుతున్నది. **(ఉళన్)** - ఇటువంటి శ్రుతిలో ప్రతిపాదింపబడే వాడై ప్రకాశిస్తున్నాడు. తాము (ఆళ్వార్లు) ఇంతకు ముందు అనుసంధించిన అర్థాలను శ్రుతిని సాక్షిగా పల్కుతున్నందున, దానిలో (శ్రుతిలో) చెప్పబడే శ్రియఃపతిత్వం, నారాయణ శబ్దం చేత నిర్దేశింపబడడం ఇక్కడ ఆళ్వార్లు అనుసంధించారని భావించాలి. వీరికి నిర్దోష శ్రుతియే ప్రమాణం కనుక, బాహ్యామతస్థులు జీవేశ్వరుల మధ్య అన్యథా సంబంధాన్ని పలికే మాయావాదులు అర్థతః నిరసింపబడ్డారు) అని శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానం.

**''నారణన్ ముఴుఏఴులకుక్కుమ్ నాదన్''** (2-7-2) (నారాయణుడు, పూర్తిగా ఏడు లోకాలకు ప్రభువు) అని అన్నారు, ఆఴ్వార్లు సర్వ లోకాలకు స్వామి - అని దీని అర్థం. **''అశేష చిదచిద్వస్తు శేషి''** (సమస్త చిదచిత్తులకు శేషి) అనేది నారాయణ శబ్దార్థం. ఈ అర్థాన్ని ఆఴ్వార్లు నేరుగా పల్కుతున్నారా! అంటే లేదు. **''నారణన్ ముఴుఏఴుల కుక్కుమ్ నాదన్''** అని పల్కిన వెంటనే, **''వేద మయన్''** - వేద ప్రతిపాద్యుడు - వేదంలో సర్వ స్వామిగా ప్రతిపాదింపబడేవాడు అని అన్నారు. ఆఴ్వార్లు స్వతంత్రంగా కల్పించి దేనినీ పల్కడం లేదు. వారు పరమ వైదికులు కనుక, వేదం పరమాత్మను గూర్చి ఏమి పల్కిందో, దానినే తాము కూడ అనుసంధించి మనకు తెల్పుతున్నారు. **''వేదమ్ తమిళ్ శెయ్‌ద మాఅన్''** కద, ఆఴ్వార్లు.

భగవానుడే బుద్ధుడుగా, కపిల మునిగా అవతరించినా, వీరికి ఆలయాలను కట్టి ఆరాధనాదులను చేయడం లేదు. ఇవి భగవానుని అవతారాలైనా, వేద ప్రామాణ్యాన్ని అంగీకరించకుండా, వేద విరుద్ధంగా పల్కినందు వల్ల, వేదమార్గానికి బాహ్యంగా పల్కినందున ఈ అవతరాలను వైదికులమైన మనం అంగీకరించడం లేదు.

**"కళ్ళవేడత్తైక్కొణ్డు పోయ్ ప్పురమ్ పుక్కవాఱుమ్ కలన్దు అశురరై''** (5-10-4) (మాయావేషాన్ని ధరించి పోయి, త్రిపురాలలో ప్రవేశించిన క్రమం, అసురులతో కలసి....) అని అన్నారు ఆళ్వార్లు.

భగవత్ స్వరూప రూప గుణైశ్వర్యాదులు అన్నిటికి వేదమే ప్రమాణం. మన సంప్రదాయంలో ప్రమాణాలను ఉపన్యసించకుండా అర్థ విన్యాసం చేయబడదు. ఏ విషయాన్ని పల్కినా, వెంటనే దానికి తగిన ప్రమాణ బలాన్ని - వేదాంత వాక్యాలను గాని, గీతా వాక్యాలను గాని, ఇతిహాస పురాణ వాక్యాలను గాని, ధర్మశాస్త్ర వచనాలను గాని, ఆళ్వార్ల దివ్య ప్రబంధ సూక్తులను గాని ప్రదర్శించడమే క్రమం. ప్రమాణ వచనాలను ఉదాహరించియే విషయాన్ని పలకాలి. ఇదే పరమ ప్రామాణికులైన మన పూర్వాచార్యులు దృఢంగా అనుసరించిన మార్గం. నేనే స్వయంగా పల్కుతున్నాను'' అని ఎవరూ ఏ అర్థాన్ని చెప్పరు.

నమ్మాళ్వార్లు కూడ ఈ క్రమాన్ని అనుసరించియే **"నారణన్ ముఴుఏఴులకుక్కుమ్ నాదన్''** అని పల్కిన వెంటనే **'వేదమయన్''** సర్వ వేదవేద్యుడు - అనే దానికి వేదమే ప్రమాణమని సూచించారు. ప్రమాణ బలంతోనే మాటలను పలకాలి తప్ప, కేవలం తర్క పాండిత్యంతో కాదు. శ్రీవేద వ్యాసులు తర్కపాదంలోని తాత్పర్యార్థంగా ఈ అర్థాన్నే తెలిపారు. దోషం లేని యధార్థజ్ఞానం **"ప్రమా''** లేక, **"ప్రమితి''** అనబడుతుంది. ఒక వస్తువు ఏ విధంగా ఉన్నదో, దానిని ఆవిధంగానే యథాతథంగా తెలియడమే ప్రమాత్మక జ్ఞానమవుతుంది.

ప్రమితి కల్గడానికి ఏది సాధనమో, అది ప్రమాణమనబడుతుంది. ప్రమాణాన్ని "ప్రత్యక్షమని, అనుమానమని, శబ్దం (శాస్త్రం) అని మూడు విధాలుగా మన పూర్వాచార్యులు విభాగించారు. బ్రహ్మం విషయంలో ప్రత్యక్ష ప్రమాణం కాని, లేక, అనుమాన ప్రమాణం కాని ఫలించదు.

ప్రత్యక్ష ప్రమాణంతో మనం పరమాత్మను తెలియలేము. శబ్ద ప్రమాణాన్ని, శాస్త్రార్థాన్ని పురస్కరించుకొని మన పరమాత్మను తెలియడం వీలుకాదు. శబ్ద ప్రమాణాన్ని- శాస్త్రాన్ని ఆధారంగా చేసికొని పరమాత్మను గూర్చి మనం తెలియగలం.

శాస్త్రయోనిత్వాత్ అని వ్యాసులు సూత్రీకరించారు. శాస్త్రానికి పరమాత్మ యోనియా? (కారణమా?) లేక, శాస్త్రం పరమాత్మకు యోనియా? అంటే, పరమాత్మ శాస్త్రానికి కారణం - అనే పక్షాన్ని మన ఆచార్యులు ఖండించారు.

వేదానికి బ్రహ్మం కారణం అని అంటే, వేదం కార్యం, బ్రహ్మం కారణం - అని చెప్పినట్లవుతుంది. నిత్యమైన వేదాన్ని బ్రహ్మం సృష్టించింది - అని ఏ విధంగా చెప్పగలం?

అయితే వేదాన్ని బ్రహ్మనికి కారణంగా చెప్పవచ్చు. ఇక్కడ ఒక ఆక్షేపం కలుగవచ్చు. బ్రహ్మనికి శాస్త్రం కారణం - అని అంటే, బ్రహ్మం కార్యం, శాస్త్రం కారణం - అని చెప్పినట్లే కద అవుతుంది! మన సంప్రదాయాను సారం. మనం బ్రహ్మం నిష్కారణం, తనకు ఏ కారణం లేనిది - అని చెప్పినందున ఈ విధంగా కూడ మనం గ్రహించడానికి వీలు లేదు.

ఈ సందర్భంలో మన పూర్వాచార్యులు సమాధానాన్ని పల్కుతారు. అది ఏమంటే - కారణత్వాన్ని మనం రెండు విధాలుగా చెప్పవచ్చు. ఒకటి ఉత్పత్తి కారణం, ఇంకొకటి జ్ఞప్తి కారణం. కుమ్మరి మట్టితో కుండను చేస్తున్నాడు. కుమ్మరి కుండను నిర్మిస్తున్నందున కుండకు అతడు ఉత్పత్తి కారణమవుతున్నాడు. ఒకచోట ఒక పుస్తకమున్నదని మనకు తెలుసు. ఇక్కడ పుస్తకానికి సంబంధించిన జ్ఞానమే మనకు కల్గుతున్నది. ఇక్కడ పుస్తకమే మన చేత నిర్మింప బడలేదు. ఈ విధంగానే పరమాత్మకు సంబంధించిన జ్ఞానాన్ని వేదం

మనకు కల్గిస్తున్నది. అందుచేతనే వేదానికి వేదమనే పేరు కల్గింది. **వేదయతీతి వేదః** (తెలుపుతున్నది కనుక వేదం) అనే విధంగా పరమాత్మకు చెందిన స్థిరమైన యదార్థ జ్ఞానాన్ని కల్గించినందున వేదం ప్రమాణమనబడుతున్నది. పరమాత్మ జ్ఞానానికి వేదం కారణం.

వేదాన్ని అధ్యయనం చేయడం ద్వారా పరమాత్మకు చెందిన జ్ఞానాన్ని మనం పొందుతున్నాము. బ్రహ్మానికి వేదం జ్ఞాపక హేతువుగా అవుతున్నందున, **శాస్త్ర యోనిత్వాత్** అనే సూత్రాన్ని వ్యాసమహర్షి అనుగ్రహించారు.

ఇక, వేదానికి గల గొప్పతనాన్ని, పరమాత్మ విషయంలో వేదం ప్రమాణం - అనే సత్యాన్ని దృష్టిలో పెట్టుకొని కొన్ని ప్రమాణ వచనాలను పెరియవాచ్చాన్ పిళ్ళై ఉదాహరించారు. **వాచా విరూప నిత్యయా** (యజు-కాండ-2-6-2-2) (అందమైన రూపాన్ని కలవాడా! నిత్యమైన వేద వాక్యం చేత నీవు చెప్పబడుతున్నావు) అని పరమాత్మ విషయంలో వేదం ప్రమాణమనే దానిని వేదమే మనకు తెల్పుతున్నది. **వేదవేద్యేపరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా** (వేదాలచే తెలియబడే పరమపురుషుడు దశరథ కుమారుడై జన్మించగా, ఆ వేదం వాల్మీకి ద్వారా సాక్షాత్తు శ్రీరామాయణ రూపంలో అవతరించింది) అనే స్కాంద వచనం కూడ భగవంతుడు వేద వేద్యుడనే వాస్తవాన్ని తెల్పుతున్నది.

**అనాది విధనాహ్యేషా వాగుత్సృష్టా స్వయం భువా** (ఆదిని, అంతాన్ని లేని ఈ వేదమనే వాక్కు స్వయంగానే అవతరించిన పరమాత్మచే వ్యక్తం చేయబడింది) (మహాభారతం - శాంతి -231-5) అని ఉపబృంహణ వచనం. వేదానికి గల గొప్ప తనాన్ని శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై - **అనాదినిధన అవిచ్ఛిన్న సంప్రదాయమాయ్, నిత్య నిర్దోషమాయ్, భ్రమవిప్రలంభాది దోష గంధ రహితమాన వేదజ్గళ్**

(ఆది అంతం లేనిదై, నిరంతరమైన సంప్రదాయాన్ని కల్గినదై, నిత్యమై, నిర్దోషమై, భ్రమ, విప్రలంభం మొదలైన దోషాల స్పర్శను ఏ మాత్రం లేనిదైన వేదాలు) అని అనుగ్రహించారు.

నిత్యమైనది, ఆదిని, అంతాన్ని లేనిది, అవిచ్ఛిన్నమైన ఆచార్య శిష్య సంప్రదాయాన్ని కల్గినది, నిత్య నిర్దోషమైనది, అపౌరుషేయమైనది (ఏ పురుషుని చేత నిర్మింప బడనిది) - అనేది వేదానికి గల గొప్పతనాలు.

**పౌరుషేయ ప్రబంధం** (ఒక పురుషుని బుద్ధిచే నిర్మితమైన గ్రంథం) అయితే ఆ పురుషునిలో ఉండే అశక్తి, అజ్ఞానం, ప్రమాదం, అనవధానం, భ్రాంతి, విప్రలంభం మొదలైన దోషాలన్నీ అతని చేత నిర్మింపబడిన ఆ గ్రంథానికి కూడ సంక్రమిస్తాయి. అందువల్ల పౌరుషేయ ప్రబంధానికి గల అజ్ఞానం, ప్రమాదం, భ్రాంతి, విస్మృతి వంటి దోషాలు ఏవీ వేదానికి లేవు.

**అన్నవాయ్ మునివరోడు అమరరేత్త అరుమఱైయై వెళిప్పడుత్త వమ్మాన్ తన్నై** (తిరునెడున్దాణ్డకమ్-30) (హంసరూపియై, మునులతో పాటు దేవతలు స్తుతించగా, అరుదైన వేదాన్ని వ్యక్తం చేసిన స్వామిని) అని అన్నారు, కలియన్. ఇక్కడ, **ఋషికళోడే కూడ బ్రహ్మాదికళ్ వేద చక్షుస్సై ఇழన్దోమ్ ఎన్‌స్తుతన్నై ఆశ్రయిత్తు ఏత్త, అపౌరుషేయుత్వం మలైయాద వడి హంస రూపియాయ్** (ఋషులలో కూడ బ్రహ్మాదులు "వేదమనే నేత్రాన్ని కోల్పోయాము" అని తనను ఆశ్రయించి స్తుతించగా, అపౌరుషేయత్వం కోల్పోని రీతిలో హంస రూపియై) అని పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానించారు.

భగవంతుడు ఎందుకు మానవ రూపంలో అవతరించి, వేదాలను వ్యక్తంచేసి అనుగ్రహించలేదు? అతడు అపౌరుషేయత్వ స్థాపనార్థం పురుష రూపాన్ని గ్రహించకుండా హంస రూపాన్ని గ్రహించాడు. వేదం అపౌరుషేయం కనుక, (దానికి పౌరుషేయత్వ మనే దోషం వస్తుందేమో!

అని) భగవంతుడు పురుషునిగా అవతరించకుండా, హంస రూపియై అవతరించి, వేదాన్ని గ్రహించి ఇచ్చాడు - అని వ్యాఖ్యానం. వేదానికి గల అపౌరుషేయత్వానికి అంతటి గొప్పతనం ఉన్నది. అని పూర్వాచార్యులంటారు.

"వేదం పరమాత్మను గూర్చి తెల్పుతున్నది" - అనే విషయంలో ఒక ఆక్షేపం కల్గుతున్నది. అది ఏమంటే - బ్రహ్మం అనేది అపరిచ్ఛిన్న వస్తువైనపుడు, వేదం ఆ బ్రహ్మాన్ని గూర్చి తెల్పుతున్నది అని ఏ విధంగా చెప్పడానికి సాధ్యం? వేదం మొదట తాను పరమాత్మను గూర్చి తెలిస్తే కద, అది ఆ జ్ఞానాన్ని మిగిలిన వారికి తెలుపగలదు! వేదమే స్వయంగా పరమాత్మను గూర్చి తెలియడం సాధ్యం కాలేదని పల్కిందే!- అనేది ఆ ఆక్షేపం.

**నేతినేతి** (బృహదా 4-3-6) (ఈ పరమాత్మ ఇటువంటివాడు మాత్రమే కాదు, ఇటువంటివాడు మాత్రమే కాదు) అని, **యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ** (తైత్తి- ఆనంద 9-1) (మనస్సుతో పాటుగా వేద వాక్కులు ఏ పరమాత్మను యథాతథంగా తెలియలేక వెనుకకు మరలుతున్నదో) అని వేదమే పరమాత్మను గూర్చి తెలిసికోవడం తనకు సాధ్యం కాలేదని స్పష్టంగా పల్కినపుడు, అది పరమాత్మను గూర్చి తెల్పుతున్నది - అని ఏ విధంగా చెప్పడానికి వీలున్నది? అనేది ఆక్షేపం. దీనికి సమాధానం ఏమంటే- వేదం పరమాత్మను తెలియడం ఏ విధంగా? అనే విషయాన్ని జాగ్రత్తగా గమనించాలి. వేదం పరమాత్మను ఏ విధంగా తెలిసికొన్నది, ఆ విధంగా తెలియబడిన జ్ఞానాన్ని మనము ఏ విధంగా తెల్పుతున్నది - అని గమనించాలి. సంగ్రహంగా కొన్ని విషయాలు మాత్రం ఇక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

వేదం "పరమాత్మ అపరిచ్ఛిన్నమైన వైభవాన్ని కలవాడు" అనియే

పరమాత్మను గూర్చి తెలిసి, ఆ విధంగా తనచే తెలియబడ్డ పరమాత్మకు గల ప్రభావాన్ని ఆ విధంగానే మనకు తెల్పుతున్నది అనేదే ఇక్కడ మనం సారంగా గ్రహించవలసిన సత్యం. **అఱిన్దనవేద అరుమ్ పొరుళ్** (9-3-3) అని ఇతః పూర్వం ఉదాహరించిన శ్రీశఠకోపుల శ్రీసూక్తిని ముందుగా గ్రహిద్దాం. **అఱిన్దన వేదమ్** (వేదం తెలిసికొన్నది) అని మొదట అన్నారు. వేదం ఏ విధంగా తెలిసికొన్నది? అనే ప్రశ్నరాగా, దానికి వేదం పరమాత్మను అపరిచ్ఛేద్యునిగా తెలిసికొన్న రీతిని పల్కుతున్నారు. దుర్జ్ఞేయమైన అర్థాన్ని (తెలియడానికి సాధ్యం కాని అర్థాన్ని) తెలిసికొన్నది వేదం -అని వ్యాఖ్యానం. వేదం భగవంతుని దుర్జ్ఞేయుడనియే తెలిసికొన్నది. ఆ విధంగానే తెలుపుతున్నది కూడ.

ఒక విషయాన్ని తెలిసికోవడం అంటే ఏమి? వస్తువు ఉండే రీతిని తెలియడమే దానిని తెలియడం. ఇక్కడ కూడ ఆ విధంగానే గ్రహించాలి. వేదం పరమాత్మను ఏ విధంగా తెల్పుతున్నది. వేదం పరమాత్మ ఏ విధంగా ఉన్నాడో, ఆ విధంగానే అతనిని తెల్పుతున్నది. **సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ** (తైత్తి-ఆనంద-1) (వికార రహితంగా, జ్ఞానమయంగా, అంతు లేనిదిగా ఉంటుంది, బ్రహ్మం) అని అంటూ వేదం పరమాత్మను తాను తెలిసిన రీతిని పల్కుతున్నది. పరబ్రహ్మం స్వరూప - గుణాలతో అపరిచ్ఛిన్నంగా ఉన్నందున దానిని అపరిచ్ఛిన్న మనే వేదం తెల్పుతున్నది.

**వేదాహమేతం పురుషం మహాంతమ్** (పురుష సూక్తమ్) (నేను ఈ పరమ పురుషుని - పరిచ్ఛేదించడానికి సాధ్యంకాని గొప్ప వానినిగా తెలిసికొంటున్నాను) అని వేదం భగవానుని గూర్చి తెల్పుతున్నది. దీనిని అనుసరించియే విశ్వామిత్ర మహర్షి **అహంవేద్మి మహాత్మానమ్** (రామా- బాల-19-14) (నేను శ్రీరాముని గొప్పవానినిగా తెలిసికొంటున్నాను) అని అన్నారు. **యేచవేదవిదో విప్రాః యే**

**చాధ్యాత్మ విదో జనాః, తే విదంతి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్** (భారత - అరణ్య -71-123) (వేదాన్ని తెలిసికొన్న విప్రులు, తత్త్వజ్ఞానాన్ని కల్గిన జనులు శ్రీకృష్ణుని మహాత్మునిగా, సనాతన ధర్మ స్వరూపునిగా తెలిసికొంటున్నారు) అనే వచనం కూడ స్మరణీయం. ఈ విధంగా అపరిచ్ఛిన్న వస్తువును పరిచ్ఛిన్నమని తెలియడం యదార్థ జ్ఞానం కాబోదు. అపరిచ్ఛిన్న వస్తువును అపరిచ్ఛిన్నమని తెలియడమే సరి అయిన జ్ఞానం.

అయితే వేదమే నేతి నేతి అని అంటున్నదే! అని అంటే, దీనిలోని అర్థాన్ని వేద వ్యాస మహర్షే స్వయంగా బ్రహ్మ సూత్ర ప్రబంధంలో తెలియజేశారు. నేతి నేతి అనే ఈ శ్రుతి వాక్యానికి గల అర్థాన్ని దీనికి ముందు వెనుకలలో ఉండే ప్రకరణాలను దృష్టిలో పెట్టుకొని నిర్ణయించాలి.

ఈ వాక్యానికి ముందు బ్రహ్మానికి ఉండే కొన్ని రూపాలు వర్ణింపబడుతున్నాయి. ఈ విధంగా వర్ణింపబడిన రూపాలు మాత్రమే బ్రహ్మానికి ఉన్నాయని ఎవరూ నిర్ణయించకూడదు - అని అనడం కోసంగా **నేతి నేతి** (ఇంత మాత్రమే కాదు, ఇంత మాత్రమే కాదు) అని వేదం పల్కింది.

**ప్రకృతైతా వత్త్వంహి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః** (3-2-21) (ఇంత మాత్రవే బ్రహ్మం - అనే దానిని శ్రుతి ప్రతిషేధిస్తున్నది. అందువల్లనే పలుమార్లు **నేతి నేతి** అని అంటున్నది) అనే సూత్రంలో ఈ అర్థాన్ని తెల్పింది. **ప్రకృతైతావత్త్వంహి** = ఈ విధంగా పల్కుతూ వచ్చేటపుడు, "ఇంత మాత్రమే" అని మనస్సులో తోచే భావాన్ని, **ప్రతిషేధతి ఇతిన, ఇతిన** ఇంత మాత్రమే కాదు, ఇంత మాత్రమే కాదు - అని ఉపనిషత్ నిషేధిస్తున్నది, తతః = ఆ పిమ్మట కూడ, భూయః బ్రవీతిచ = తిరిగి

తిరిగి బ్రహ్మానికి ఉండే గుణాలను అపారంగా పల్కుతున్నది - అని వ్యాసులన్నారు.

అందువల్ల, వేదాంతం ఏమి చేస్తున్నది? మొదట భగవానుని కొన్ని వైభవాలను గూర్చి పల్కుతున్నది. తరువాత, "భగవానుని వైభవాలు ఇంత మాత్రమే అని భావించకు సుమా - అని పల్కి , అతని వైభవాలను ఇంకా ఇంకా వర్ణిస్తున్నది. **న హ్యేతస్మాదితి నేత్యన్యత్ పరమస్తి, అథ నామ ధేయం సత్యస్య సత్యమితి, ప్రాణావైన త్యం తేషామేషసత్యమ్** (బృహ-4-3-6) (నేతి అని చెప్పబడే బ్రహ్మం కంటే రూపగుణాలతో గొప్పదైన వస్తువు వేరేమీ లేదు. "సత్యానికి కూడ సత్యం" అనేది ఈ బ్రహ్మానికి నామం.

ప్రాణమనబడే జీవుడు ఆకాశం మొదలైన అచేతన వస్తువుల వలె స్వరూప వికారం లేనివి అయినందున, సత్యమనబడుతున్నాడు. (జీవుని వలె జ్ఞానంలో సంకోచం లేనందున) బ్రహ్మం అతని కంటే సత్యమనబడుతున్నది) అని తరువాత ఉండే వాక్యం ఉన్నది. ఈ విధంగా అపరిచ్ఛిన్న వైభవశాలి పరమాత్మ - అనేదే ఈ వాక్యానికి తాత్పర్యమని తేలింది.

గోదాదేవి కూడ **ఊత్తముడైయాయ్! పెరియాయ్!** (తిరుప్పావై - 21) అని అన్నారు. పెరియన్ అంటే అపరిచ్ఛిన్నమైన వైభవాన్ని కలవాడు అని అర్థం.

వేద వేదాంతాలు ఎంత కాలం పాటు కలిసి పల్కినా వాటికి పరమాత్మ వైభవాన్ని లెక్కించడం వీలు కాదు. ప్రమాణంతో అతని మహిమను "ఇంత మాత్రం" అని పరిచ్ఛేదించడం సాధ్యం కాదు - అని అంత మాత్రమే కాదు; ప్రమాతలకు కూడ అతని గొప్ప తనాన్ని "ఇంత మాత్రం" అని పరిచ్ఛేదించడం సాధ్యం కాదు.

నిత్యసూరులు సైతం ఎంత కాలం కలిసి భగవంతుని స్తుతించినా,

అతడు వారి స్తోత్రాలకు అన్నిటికి అందకుండానే ఉంటాడు. అన్నిటికంటే కూడ, భగవానుడు తనచే కూడ తన గొప్పతనాన్ని పరిచ్ఛేదించడం సాధ్యం కాదు.

అందువల్ల ప్రమాణాలకు అపరిచ్ఛిన్నుడై, ప్రమాతలకు కూడ అపరిచ్ఛిన్నుడై, ప్రమేయాం పరిచ్ఛిన్నుడై ఉండే అతని వైభవం అంతులేనిదిగా ఉన్నది - అనేదే యథార్థం. **యతో వాచో నివర్తంతే** (తైత్తి-ఆనంద-9-1) (మనస్సుతో పాటు వేద వాక్కులు ఏ పరతత్త్వాన్ని పరిచ్ఛేదించి పలుక లేక వెనుకకు మరలు తున్నవో) అనే శ్రుతి వాక్యానికి అభిప్రాయం ఇదే.

ఇది మనుష్యానందం, దీనికంటే గొప్పది దేవతల ఆనందం, దీని కంటే గొప్పది ఇంద్రుని ఆనందం, అంతకంటే గొప్పది బృహస్పతి ఆనందం, అంతకంటే గొప్పది చతుర్ముఖుని ఆనందం - అని పల్కుతూ, చివరకు బ్రహ్మానందాన్ని పరిచ్ఛేదించి తెలియాలని చూచింది, వేదాంతం.

అయితే ఎంతగా ప్రయత్నించినా, దానికి ఒక అంతు చూడడం సాధ్యం కానందున "భగవానుని ఆనందం పరిచ్ఛేదించి తెలియడం సాధ్యం కానిది" అని పల్కి వెనుదిరిగింది. అందుచేత పరమాత్మ యొక్క ప్రభావాన్ని పరిచ్ఛేదించి తెలియడం సాధ్యం కాదు - అనే వేదాంతం పల్కుతున్నది తప్ప, అతని వైభవాన్ని ఏ విధంగాను తెలియడం సాధ్యం కానే కాదు - అని అనలేదు. ఇందువల్ల వేదం పరమాత్మను గూర్చి తెలుపడంలో ప్రమాణమే - అని తేలింది.

ఇక, పరమాత్మను తెలియజేయడంలో వేదం అంతా ప్రమాణమే - అనేది ఏ విధంగా? అనే విషయాన్ని గూర్చి చూద్దాం. వేదం కర్మ కాండం - అని, బ్రహ్మ కాండం అని రెండు భాగాలు.

మీమాంసా అనే దానికి పూజ్యమైన విచారం, గొప్ప విషయాన్ని గూర్చిన విచారం అని అర్థం. కర్మకాండను గూర్చిన విచారాన్ని జైమిని

మహర్షి చేసి, కర్మ మీమాంసా శాస్త్రాన్ని రచించారు. నాల్గు అధ్యాయాలను కల్గినది, కాశకృత్స్నునిచే ప్రకాశితమైనది అయిన దేవతాకాండంతో కూడిన కర్మ మీమాంసా శాస్త్రం పదహారు అధ్యాయాలను కల్గినది. బ్రహ్మ విచారపరమైన బ్రహ్మ మీమాంసా శాస్త్రం, నాల్గు అధ్యాయాలను కల్గినది. ఇవి అన్నీ చేరి మీమాంసా శాస్త్రం ఇరవై అధ్యాయాలను కల్గినదై, ఒకే శాస్త్రం చెప్పబడుతున్నది.

కర్మకాండం భగవదారాధన రూపమైన యాగ కర్మలకు సంబంధించినది. దేవతాకాండం భగవానునకు శరీర భూతులైన దేవతలను గూర్చినది. సర్వకర్మ సమారాధ్యుడైన, సర్వ దేవతాంతర్యామి అయిన భగవానుడు బ్రహ్మ కాండ ప్రతిపాద్యుడు. పూర్వ భాగమైన వేదం, ఉత్తర భాగమైన వేదాంతం - ఈ రెండు కలిసి ఆరాధన విశిష్ట ఆరాధ్యుడైన పరమాత్మను గూర్చి తెల్పుతున్నవి.

ఈ విధంగా పూర్వోత్తర భాగాలు రెండింటికి అతడే ప్రతిపాద్యుడవు తున్నాడు. ఈ విధంగా వేద వేదాంతాలు అన్నీ పరమాత్మ విషయంలో ప్రమాణ భావాన్ని కల్గినవిగా ఉన్నాయి. ఇందుచేత వేదం అంతా పరమాత్మ విషయంలో ప్రమాణం అని ఏర్పడింది.

వేదం, వేదాంతం - రెండూ పరమాత్మను గూర్చినవే - అని, కర్మకాండ బ్రహ్మకాండ విచారపరమైన మీమాంసా శాస్త్రం ఒకే శాస్త్రమని మన స్వామి శ్రీరామానుజులు శ్రీభాష్యంలో నిరూపించారు.

వీటిని పురస్కరించుకొనే మనం పరమాత్మను గూర్చి తెలియగలం, తెలియడానికి సాధ్యం తప్ప, అనుమానం వల్లగాని, లేక, అన్య ప్రమాణాల వల్ల గాని మనం బ్రహ్మాన్ని గూర్చి తెలియలేము.

**ఆదౌ వేదాః ప్రమాణమ్** అనే దానిలో ఇంత అర్థాన్ని అభిప్రాయపడ్డారు, శ్రీపరాశర భట్టర్ - అనే యథార్థాన్ని **ఈశ్వరన్**

**అనుమాన ప్రమాణసిద్ధన్ - ఎన్ఱుశొల్లుకిఱవాది ప్రతిక్షేపత్తైప్పణ్ణిక్కొణ్డు** (ఈశ్వరుడు అనుమాన ప్రమాణం ద్వారా సిద్ధిస్తున్నాడు - అని వాదించే వారి వాదాన్ని నిరసిస్తూ) అని మనకు శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై తెలియజేశారు. అంటే, **ఆదౌ వేదాః ప్రమాణమ్** అనే వాక్యం ప్రతిపక్షాన్ని నిరసించడం కోసంగా ఏర్పడినది - అని వ్యాఖ్యానం. వేదాన్ని **ప్రమాణమ్** అని నిర్దేశించినందున, వేదాన్ని అంగీకరించని మతాలు నిరసింపబడ్డాయని అర్థం.

పరమ వైదికమైన మన పక్షాన్ని తెలుపడం వల్ల, దీనికి విరుద్ధమైన అవైదిక పక్షాలన్నీ నిరసింప బడినవి అయ్యాయి - అని భావం.

తిరువాయ్ మొళిలోని మొదటి పాశురంలోనే నమ్మాళ్వార్లు **నలముడైయవన్** (ఆనంద గుణాన్ని కలవాడు), **అరుళినన్** (అనుగ్రహించాడు), **అమరర్కళ్ అదిపతి** (నిత్య సూరులకు అధిపతి), **శుడరడి** (వికస్వరమైన శ్రీచరణాలు) అని భగవానునకు గుణాలు, విభూతులు, దివ్య మంగళ విగ్రహం అన్నీ ఉన్నాయని అన్నారు. ఈ విధంగా పల్కడం ద్వారా దీనికి విరుద్ధమైన "బ్రహ్మానికి విభూతి లేదు, గుణాలు లేవు; విగ్రహం లేదు" - అనే వాదాన్ని పలికేవారి వాదాలు అన్నీ ప్రహతాలై నశించాయి - అని వ్యాఖ్యానం.

"గుణాలు లేవు, విగ్రహం లేదు, విభూతి లేదు" అని వాదించేవారు అందఱు ఈ పాశురంతో నిరసింపబడ్డారు. వారిని ప్రతి వాదులుగా చేసి, ఏమీ చెప్పనక్కరలేదు కద! స్వపక్షాన్ని స్థాపించగానే పరపక్షం నిరస్తమవు తుంది కద! పైరును వృద్ధి చేస్తే కలుపు తానంతట అదే పోయేటట్లు, వారు తమకు తామే నిరసింపబడిన వారవుతారు కద" **(గుణ మిల్లై; విగ్రహమిల్లై; విభూతియిల్లై; ఎన్ఱుశొల్లు కిఱవర్కళ్ ఎల్లారుమ్ ఇప్పాట్టాలే నిరస్తర్. అవర్ కళై ఎదిరికళు క్కిచ్చొల్లవేణ్డా విదే. స్వపక్షత్తై స్థాపిక్కవే, పర పక్షమ్**

**నిరస్తమామిటే. నెఱ్ఱెయ్యప్పుల్ తేయు మా పోలే, తన్నడైయే నిరస్తవర్ కళితే, అవర్ కళ్)** అనే ఈడు వ్యాఖ్యాన శ్రీసూక్తి, ఇక్కడ అనుసంధేయం.

ఇంతే కాదు; పరమాత్మ విషయంలో సాంగమైన వేదమే ప్రమాణం - అనే దానిని తరువాత అనుగ్రహిస్తున్నారు, భట్టర్. వేదాలు సపరికరంగా ఉండాలి - అనే దానిలో ఏమి అభిప్రాయం? వేదాలకు గల పరికరాలు ఏవి? **స్మృతిరుపకురుతే సేతి హాసైః పురాణైః న్యాయైః సార్థమ్** - స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు, పూర్వ మీమాంసా న్యాయాలు, ఉత్తర మీమాంసా న్యాయాలు ఇత్యాదులు వేదానికి పరికరాలు.

ఒక విషయాన్ని గూర్చిన విచారంలో ప్రవేశించేటపుడు ఆకాంక్ష ఏర్పడుతుంది. ఆకాంక్షకు సమాధానం ఏర్పడకపోతే అర్థ పూర్తి కలుగదు. పూర్వకాండాన్ని అధ్యయనం చేస్తున్నాము. ఇందులో వాజపేయం మొదలైన యాగ క్రమాలను గూర్చి చెప్పబడింది. యాగాలను గూర్చి తెలిసే కాలంలో ఈ యాగ కర్మలకు ఆరాధ్య దేవత ఎవరు? అనే ప్రశ్న కల్గుతుంది. ఈ ప్రశ్నకు సమాధానం వేదాంత శాస్త్రాన్ని అధ్యయనం చేసినపుడే ఏర్పడుతుంది. ఇదే విధంగా, బ్రహ్మకాండలో ఆరాధ్యుడైన భగవానుని గూర్చి పలికేటపుడు, ఇతనికి గల ఆరాధనలను గూర్చిన ఆకాంక్ష కలుగగా, దీనికి సమాధానాన్ని పూర్వకాండ నుండే గ్రహించాలి. ఈ విధంగా రెండు భాగాలను కలిపి చూచే వానికే యథార్థమైన అర్థం బోధ పడుతుంది.

మతాంతరస్థులలో కొందఱు పూర్వభాగాన్ని మాత్రం గ్రహించి, ఉత్తర భాగాన్ని విడచి వేస్తారు. మఱి కొందఱు ఉత్తర భాగాన్ని మాత్రం గ్రహించి పూర్వభాగాన్ని విడిచి పెడతారు. వీరి ఇటువంటి స్థితికి ఒక దృష్టాంతాన్ని వేదాంతాచార్యుల వారు పలికారు. కొందఱు శరీరం మాత్రం చాలు; తల అక్కర లేదు - అని, మరి కొందఱు తల మాత్రం

చాలు; శరీరం అక్కర లేదు - అని పల్కడం వంటిదే ఇది - అనేది దృష్టాంతం. శరీరాన్ని (పూర్వభాగాన్ని) మాత్రం గ్రహించేవారు కబంధ మీమాంసకులు (పూర్వ మీమాంసకులు), తలను (వేదాంతాన్ని) మాత్రం గ్రహించేవారు రాహు మీమాంసకులు (అద్వైతులు) కబంధ మీమాంసకులు దైవాన్ని అంగీకరించకుండా, కర్మలను మాత్రం ఒప్పుకొంటున్నారు. వేదాంతం ఆత్మను గూర్చి తెల్పుతున్నది. ఈ ఆత్మ అంటే ఎవరు? పూర్వకాండమనే వేద భాగంలో చెప్పబడే వాజపేయం, సోమ యాగం ఇత్యాది యాగకర్మలకు దీక్షితుడై (యజ్వయై), యాగాన్ని నిర్వహించే జీవాత్మయే వేదాంతం కీర్తించే ఆత్మ - అని వీరంటారు. **సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ** అని ఈ యాగ కర్మకు కర్త అయినవానినే వేదాంతం కీర్తిస్తున్నది - అనేది వీరి పక్షం. వీరి మతంలో యాగం, యాగ కర్త అయిన జీవాత్మ మాత్రమే ఉన్నారు (ఈశ్వరుడు లేడు). ఈ విధంగా వీరు జీవాత్మ అయిన శరీరాన్ని గూర్చి పరమాత్మ అయిన తలను (ఆత్మను) విడచి పెడుతున్నారు.

అద్వైతులైతే, బ్రహ్మాన్ని ఒప్పుకొని, వేదంలో చెప్పబడిన కర్మలు అన్నీ త్యాజ్యాలని అంటారు. వీరు తలను మాత్రం గ్రహించి, శరీరాన్ని విడిచిపెట్టేవారి వలె అవుతున్నారు - అని అంటారు దేశికులు. కర్మకు, జ్ఞానానికి సముచ్చయం లేదు - అని పలికే వారు, వీరు. అయితే మన మతంలో మనం ఈ విధంగా గ్రహించడం లేదు. భక్తి మార్గనిష్ఠుడు గాని, ప్రపత్తి మార్గనిష్ఠుడుగాని, శరణాగతి మార్గనిష్ఠుడు గాని, లేక, "ఆచార్యాభిమానమే ఉత్తారకం అనే నిష్ఠలో ఉండే వాడు గాని, ఎవరైనా (సన్యాసి అయినా) కర్మలను ఎపుడూ విడచి పెట్టడం తగదు. పూర్వ భాగంలో విధింపబడిన కర్మలు చేతనుని సన్మార్గానికి చేరుస్తాయి. ఉత్తరభాగం భగవానుని గూర్చిన జ్ఞానాన్ని కల్గించడం ద్వారా చేతనునకు భగవల్లాభాన్ని కల్గిస్తుంది.

ఇంతేకాదు. అద్వైతులకు, మనకు ఇంకొక ముఖ్యమైన వ్యత్యాసం ఉన్నది. ఒక చోట ఘటం ఉన్నది. **అయం ఘటః** (ఇది కుండ) అనే వాక్యాన్ని ఒకడు విని, ఘటాన్ని గూర్చిన జ్ఞానాన్ని పొందుతున్నాడు. ఇదే విధంగా **తత్త్వమసి** అనే, ఛాందోగ్యోపనిషత్ వాక్యాన్ని విన్న మఱు క్షణంలోనే ఒకనికి "నేనే బ్రహ్మం" అనే అద్వైత జ్ఞానం (మోక్షం) కల్గుతున్నది. "వాక్యార్థ జ్ఞానం ఏర్పడగానే మోక్షం కల్గుతున్నది" అనేది అద్వైత మతం.

అయితే, మనం ఈ విధంగా గ్రహించడం లేదు. భక్తి మార్గంలో అన్వయించినా, దాని వల్ల మోక్షం కలుగదు. ప్రపత్తి మార్గంలో అన్వయించినా, దాని వల్ల మోక్షం కలుగదు. శరణాగతి మార్గంలో అన్వయించినా దాని వల్ల మోక్షం కలుగదు. ఆచార్యాభిమానమే ఉత్తారకం అని నమ్మిఉండేవానికి కూడ దాని వల్ల మోక్షం కలుగదు. మన సిద్ధాంతానుసారంగా భక్తి మార్గంలో గాని, ప్రపత్తి మార్గంలో గాని, శరణాగతి మార్గంలో గాని, ఆచార్యాభిమానమే ఉత్తారకం అని ఉండే వానికి కాని మోక్షం లభించడం భగవదనుగ్రహం వల్లనే. ఎవడు ఏ మార్గాన్ని అనుసరించినా, అతనికి మోక్షం లభించడానికి భగవదనుగ్రహం కావాలి. అదృష్ట ద్వారకమైన మోక్షాన్నే మన మతంలో ఒప్పు కొంటున్నాము తప్ప, దృష్ట ద్వారక మోక్షమనేది మన మతానుసారంగా ఏ విధంగాను లేదు.

"ఈశ్వరానుగ్రహం వల్లనే మోక్షం సిద్ధిస్తుంది." అనే అర్థాన్నే నమ్మాళ్వార్లు తిరువాయిమొழிలోని ఆరంభ పాశురంలో అనుగ్రహించారు. **మయర్వఱ** (అజ్ఞానం తొలగే రీతిలో) మదినలమ్ (భక్తి రూపాన్ని పొందిన జ్ఞానం కలిగేటట్లు) **అరుళినన్** (అనుగ్రహించాడు) అని అన్నారు ఆழ்వార్లు. చివరలో **వీడు పెఱ్ఱు** (మోక్షాన్ని పొందిన) అని అనుగ్రహించారు. ఈ విధంగా భగవదను

గ్రహమే అవిద్యా నివర్తకం, భక్తి కల్గడం కూడ అతని అనుగ్రహం వల్లనే. మోక్షప్రదమై ఉండేది భగవదనుగ్రహమే. దీని వల్లనే అజ్ఞానం తొలగడం గాని, జ్ఞానం కల్గడం గాని, మోక్షం కల్గడం కాని అన్నీ కల్గుతాయి. శరణాగతి ఆచరించి అయినది. అయితే, మోక్షం వెంటనే లభిస్తున్నదా? అంటే, లభించడం లేదు. శరణాగతికి, మోక్షానికి నడుమ భగవత్ప్రసాదం ఏర్పడాలి. భగవత్ప్రసాదాన్ని నడుమ గ్రహించియే, శరణాగతి వల్ల మోక్షమని అంటున్నాము. **అరుళ్ కొణ్డాడుమ్ అడియవర్ ఇన్బుఱ** అని మధుర కవుల సూక్తి. **శక్తనుక్కుమ్ కృపై వేణుమ్; అశక్తనుక్కుమ్ కృపై వేణుమ్** (శక్తి కలవానికి భగవత్కృప కావాలి, శక్తిని లేని వానికి కూడ ఆ కృప కావాలి) అని నాయనార్ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. దీని వల్ల శక్తి కలవానికి, శక్తి లేనివానికి కృప కావాలి అనేది అర్థం కాదు. శక్తిని కల వానిని గూర్చి, శక్తి లేనివానిని గూర్చి కృప ఏర్పడాలి - అనేది అర్థం. శక్తి కలవాడు, శక్తి లేనివాడు - అనే తేడా లేకుండా, భగవత్కృప ఇద్దఱికీ కల్గడం ఏ విధంగా? శక్తిని కలవాడైన భక్తి యోగ నిష్ఠుడు శ్రమించి, "భగవానుని పొందాలి'' అని భక్తి యోగంలో ప్రవేశిస్తున్నాడు. చాల కష్టపడి సాధనానుష్ఠానాన్ని చేసే ఇతడి విషయంలో ఈ కారణం వల్లనే భగవానుడు కృపను వర్షిస్తున్నాడు. ఇతనికి మోక్షాన్ని అనుగ్రహిస్తున్నాడు.

శక్తిలేని వాడు (అశక్తుడు) ప్రపత్తి మార్గంలో అన్వయిస్తున్నాడు. "ఇతడు అకించనుడై అనన్యగతివాడై, మన పట్ల శరణాగతిని చేసిన వాడై ఉన్నాడే!'' అని ఇతని పట్ల కూడ కారుణికుడైన భగవానునకు కృప కల్గుతున్నది. **గురువాన ఉపాయత్తై అనుష్ఠిత్తవనిడత్తిల్, అనుష్ఠానత్తినుడైయ పెరుమైయై కటాక్షిత్తు సర్వేశ్వరన్ కృపై పణువదైప్పోల్, లఘువాన ఉపాయత్తై అనుష్ఠిత్తవనిడత్తిల్ భావశు ద్ధి యైప్పార్త్తు కృపై పణ్ణువాన్** (గొప్ప ఉపాయాన్ని అనుష్ఠించిన వాని పట్ల, అతని అనుష్ఠానం యొక్క గొప్పతనాన్ని చూచి భగవంతుడు కృప చూపేటట్లే లఘువైన ఉపాయాన్ని అనుష్ఠించిన వాని విషయంలో కూడ

సర్వేశ్వరుడు అతని భావ శుద్ధిని చూచి కృప చూపుతాడు) అని **శ్రీఉ .వే.కార్పంగాడు శిజ్గప్పెరుమాళ్ స్వామి** అనుగ్రహించిన సూక్తి ఇక్కడ అనుసంధేయం. ఈ విధంగా అదృష్ట ద్వారకంగా - భగవత్ ప్రసాదం ద్వారా - లభించేదే మోక్షం. సాక్షాత్ భక్తి గాని, ప్రపత్తి గాని, శరణాగతి గాని, ఆచార్యాభిమానం గాని మోక్ష ప్రదం కాదు. ఇదే మన సిద్ధాంతంలోని పరమ సారమైన అర్థం.

ఈ విధంగా శక్తి కలవాడు, శక్తి లేనివాడు - అనే తేడా ఏమీ లేకుండా అందఱు భగవానుని ఆశ్రయించియే, అతని మూలంగానే అతనిని పొందాలి -అని ఉన్నందున, అందఱికి అతనిని (భగవానుని) గూర్చిన జ్ఞానం ఆవశ్యకమవుతున్నది. అతనిని దేని ద్వారా మనం తెలిసి కోవడానికి సాధ్యం? అతనిని మనం వేదవేదాంతాల ద్వారానే తెలియగలం. దీనికిఉపయోగకరంగా ఉండేవే ఇతిహాస పురాణాలు, ధర్మశాస్త్రాలు, పూర్వోత్తర మీమాంసా న్యాయాలు - అని అంటారు, శ్రీపరాశర భట్టర్. ఇవి అన్ని కలిసి భగవానుని గూర్చి మనకు తెల్పుతున్నవి.

ఇదే వేదాంత వాదం. అంటే - మనము భగవానుని ఆరాధనలను గూర్చి తెలిపే కర్మ భాగం పరమావశ్యకం, భగవత్ స్వరూపం రూపం, విభూతి, గుణాలు మొదలైన వానిని తెలిపే జ్ఞాన భాగం కూడ పరమావశ్యకం. కర్మలతో భగవానుడు మనస్సులో సంతోషిస్తాడు. మన వద్ద ఉండవలసిన బ్రహ్మజ్ఞానానికి అనుగుణంగా అతడు మనకు అనుగ్రహాన్ని కురిపిస్తాడు. సంసారి జీవులమైన మనం మోక్షానందాన్ని పొందుతున్నాము. ఇదే వైదిక సిద్ధాంతం. దీనిని నిరూపించే రీతిలో ఉ న్నది, శ్రీపరాశర భట్టర్ అనుగ్రహించిన, ఈ ఆశ్చర్యకరమైన శ్లోకం - అని అంటున్నారు, శ్రీపెరియ వాచ్చాన్ పిళ్ళై.

ఇక, **అహమ్ ఏవ వేద్యః** (నేనే జగత్కారణంగా

తెలియబడుతున్నాను) అనే భగవానుని అభిప్రాయాన్ని వేదవ్యాసులు ఏ విధంగా చూపించారు? అనే విషయాన్ని గమనిద్దాం.

ఈక్షత్యధికరణం నుండి ఆరంభించి మొదటి అధ్యాయం అంతా, రెండవ అధ్యాయం మొదటి రెండు పాదాలు ఈ అర్థాన్ని తెలిపే రీతిలోనే ఉన్నాయి. ప్రకృతి జగత్కారణమని, జీవుడే జగత్కారణమని, జీవ విశేషమే జగత్కారణమని పలికే పూర్వపక్షాలను ఖండించి, బ్రహ్మమే జగత్కారణం అనే పరమ వేదాంతార్థాన్ని మొదటి నాల్గు పాదాలలో శ్రీ వేదవ్యాసులు స్థాపించారు.

**అహమ్ ఏవ వేద్యః** - నేను తప్ప, ప్రకృతి కాని, జీవుడు కాని, జీవ విశేషం కాని జగత్కారణంగా తెలియదగిన వారు కారు. నేనే జగత్కారణంగా వేదాంతాలలో తెలియబడేవాడను - అని భగవానుడు అన్నాడు.

భగవానుని ఈ సర్వకారణత్వాన్ని శ్రీవేద వ్యాసులు తర్కాలను పురస్కరించుకొని నిరూపించలేదు. భగవానుని జగత్కారణత్వాన్ని వేద వేదాంతవాక్యాల ద్వారానే వారు నిరూపించారు. ఈ విధంగా నిరూపించబడిన అర్థాన్ని రెండవ అధ్యాయం మొదటి రెండు పాదాలలో స్థిరీకరించారు.

"జగత్కారణం బ్రహ్మం, చిదచిద్విలక్షణం బ్రహ్మం, అఖిల కారణం బ్రహ్మం, అద్భుత (త్రివిధ) కారణం బ్రహ్మం, నిష్కారణం బ్రహ్మం" - అని బ్రహ్మాన్ని గూర్చి వేదాంతం ఘోషిస్తున్నది.

అయితే, ప్రకృతి జగత్కారణమని అంటారు సాంఖ్యులు. మిగిలిన వారు (వైశేషికులు, బౌద్ధులు, జైనులు, శైవులు) పరమాణువులు జగత్కారణమని అంటారు. ద్వితీయాధ్యాయం ద్వితీయ పాదమైన తర్క పాదంలో ప్రకృతి కారణ వాదం కాని, పరమాణు కారణ వాదం కాని సరికాదు - అని ఈ అయిదు మతాలను ఖండించి, బ్రహ్మమే

జగత్కారణం అని మొదటి అధ్యాయంలో వేద వేదాంత వాక్యాల ద్వారా తాము నిరూపించిన అర్థాన్ని మఱింత స్థిరపరచారు, శ్రీ వేద వ్యాసుల వారు.

గజేంద్రాళ్వాన్ భగవానుని వద్ద శరణాగతి చేసే ప్రకారాన్ని చాల అందంగా వర్ణించారు, వ్యాసులు. మొదట **నమోస్తుతే** అని భగవానుని చూచి అన్నాడు గజేంద్రాళ్వాన్. ఇదే భగవానుని వద్ద ఇతడు చేసిన శరణాగతి. **నమోస్తుతే** - నమస్కరిస్తున్నాను - అని అన్నాడు. నమస్కరించడమే శరణాగతి. నమస్కారం వేరు, శరణాగతి వేరు కాదు. నమస్కారం చేయడం శరణాగతిని సూచిస్తుంది. ఈ విషయం మన పూర్వాచార్యులచే పలు సందర్భాలలో చెప్పబడింది. అందులో ఒక సందర్భాన్ని చూపిస్తాను.

ధర్మరాజాదులు అరణ్యంలో నివసించే సందర్భం అది. అపుడు మార్కండేయుడు వారిని చూడాలని వచ్చాడు. వారికి భగవానుని పరత్వాన్ని గూర్చి విస్తృతంగా ఉపన్యసించాడు. భగవానుని పరత్వానికి సాక్షి మార్కండేయుడు - అని ఆ ఋషిని నమ్మాళ్వార్లు కీర్తించారు. **మఱుత్తు మవనోడే కణ్డీర్.... మార్క్కణ్డేయనుమ్ కరియే** (5-2-7) అనేది ఆ సూక్తి. భగవానుని పరత్వాన్ని గూర్చి ధర్మపుత్రాదులకు వివరించి, అతనిని శరణు పొందమని మార్కండేయుడన్నాడు. **సర్వేషామేవ లోకానాం పితామాతాచ మాధవః, గచ్ఛధ్వమేనం శరణం శరణ్యం పురుషర్షభాః** (లోకాలకు అన్నిటికి తల్లి, తండ్రి మాధవుడే. పురుషులలో శ్రేష్ఠులారా! అటువంటి గొప్ప శరణమైన ఇతనిని శరణు పొందండి) అనేది మార్కండేయుని ఉపదేశం. "ఈ మాధవుడు, నారాయణుడు ఎక్కడ ఉన్నాడు?" అని ధర్మరాజాదులు ప్రశ్నించారు. "నారాయణుడు ఎక్కడున్నాడని అడుగుతున్నారే! మీ అత్తకొడుకు, మామకొడుకు - అనే సంబంధాన్ని కల్గి ఉన్నాడే, శ్రీకృష్ణుడు... అతడే నారాయణుడు"

అని మార్కండేయుడన్నాడు. "మన శ్రీకృష్ణుడా!'' అని అడిగాడు, ధర్మరాజు. శ్రీకృష్ణుని ప్రభావమేమీ అతనికి అర్థం కాలేదు. (సౌలభ్యగుణ పూర్ణుడైన) శ్రీకృష్ణునితో కలసి తిరిగే స్వభావాన్ని (అలవాటును) కలవారికి శ్రీకృష్ణుని ప్రభావాన్ని గూర్చి (పరత్వాన్ని గూర్చి) మనస్సులో స్ఫురించదు కద! ఇక, ధర్మపుత్రునకు ఏ విధంగా తెలుస్తుంది?

"శ్రీకృష్ణుని శరణాగతిని చేయండి'' అని మార్కండేయుడనగా, పాండవులపుడు ఏమి చేశారు? అనే దానిని శ్రీ వేదవ్యాసులు అద్భుతంగా వర్ణించారు. **ఏవ ముక్తాశ్చతే పార్థాః యయౌచ పురుషర్షభౌ, ద్రౌపద్యా సహితాస్సర్వే నమశ్చక్రుః జనార్దనమ్** (భారతమ్ ఆరణ్య - 192-57) (ఈ విధం చెప్పబడిన కుంతీపుత్రులు నకుల సహదేవులు, ద్రౌపదితో పాటు అందరూ జనార్దనునికి నమస్కరించారు) అని వ్యాస వచనం. ఈ రెండు వాక్యాలను మనం కలిపి చూస్తే నమస్కారమే శరణాగతి అని తెలుస్తుంది.

నమస్కారం చేయడానికి ఎవరు అధికారులు? ఎవరైనా నమస్కారాన్ని చేయవచ్చు. ఎవరైనా శరణాగతిని చేయవచ్చు. అయితే, శరణాగతి చేయదగిన విషయం లోనే (వ్యక్తి దగ్గరనే) శరణాగతిని చేయాలి తప్ప, ఎవరి వద్దనైనా శరణాగతిని చేయవచ్చు - అనేది సరికాదు. శరణాగతికి విషయ నియమమున్నది. కాని, అధికారి నియమం లేదు. బ్రాహ్మణ - అబ్రాహ్మణ భేదం ఏమీ లేకుండా, స్త్రీ - పురుష విభేదం లేకుండా, దేవ మనుష్యాది భేదం లేకుండా, వసిష్ఠ - చండాల విభాగం లేకుండా, ఎవరు కావాలన్నా శరణాగతి చేయవచ్చు. కాని, ఎవరి వద్ద శరణాగతిని చేయాలి? బ్రహ్మను జగత్కారణంగా శాస్త్రం పల్కుతున్నది. కాని, ఆ బ్రహ్మకు కూడ కారణమైన భగవానుని విషయంలోనే శరణాగతిని చేయాలి.

అందువల్ల శరణాగతి ఎవరి దగ్గర చేయాలి? "అఖిలకారణుడై,

అద్భుత కారణుడై, నిష్కారణుడై'' - అని శరణ్యుడైన భగవానుని కారణునిగా పలుమార్లు గజేంద్రాళ్వాన్ వర్ణించాడు. "అఖిలకారణుడై'' దేనినీ విడువకుండా, అన్నిటికి కారణుడై భగవానుడున్నాడు. "అద్భుతకారణుడై'' జగత్తుకు నిమిత్త కారణంగాను ఉన్నాడు; జగత్తుకు ఉపాదాన కారణంగాను ఉన్నాడు; జగత్తుకు సహకారి కారణంగాను ఉన్నాడు, భగవానుడు. నిష్కారణుడై - తనకు ఏ కారణం లేనివాడై భగవానుడున్నాడు. అందువల్ల శరణ్యత్వం ఉండాలంటే, కారణత్వం ఉండాలి. జగత్కారణత్వం లేదంటే శరణ్యత్వమే ఉండదు. భగవానుడు జగత్తుకు కారణమై ఉన్నాడు; సర్వలోక శరణ్యుడై ఉన్నాడు. ఈ విధంగా భగవానునకుండే శరణ్యత్వాన్ని వర్ణించేటపుడు అతని కారణత్వంలో అభినివేశాన్ని పొందారు, వ్యాస మహర్షి.

శారీరక మీమాంసలో ఈ కారణత్వాన్ని వర్ణించే సమయంలో కూడ కారణం, కారణం, కారణం - అని మొదటి పాదం నుండి ఆఖరి పాదం వరకు కారణత్వ విచారంలోనే వ్యాసులు నిమగ్నులయ్యారు. తరువాత రెండు పాదాలలో సర్వం బ్రహ్మకార్యం అని నిరూపించారు. ఈ విధంగా బ్రహ్మం జగత్కారణం, సర్వం బ్రహ్మకార్యం అని జగత్తుకు, బ్రహ్మానికి మధ్య ఉండే కార్యకారణ భావాన్ని వ్యాసుల వారు మొదటి రెండు అధ్యాయాలలో వివరించారని ఏర్పడింది. ఇది అంతా ప్రణవంలోని "అ''కారంలో అణగి ఉన్నది. "అ''కారం జగత్కారణ వస్తువును తెల్పుతుంది - అని అనడంలో ఔచిత్యమున్నది అని అంటారు, మన పూర్వాచార్యులు. "అ''కారం శబ్దాలకు అన్నిటికి కారణం. జగత్తుకు కారణం భగవానుడు. "అ''కారం ఒక కారణం, భగవానుడు కూడ కారణం. "అ''కారం భగవద్వాచకం. ఇతడు వాచ్యం. అది నామం; ఇతడు నామి. అది శబ్దం. ఇతడు అర్థం. **ఆవియుమ్, ఆక్కైయుమ్** (ప్రాణం, శరీరం) అని అన్నారు, ఆళ్వార్లు ఆవి = ఉసురు, ప్రాణం, ఆక్కై = శరీరం. శబ్దాన్ని శరీరంగా, అర్థాన్ని ప్రాణంగా పల్కడం సంప్రదాయం.

భగవానుడు ప్రాణభూతుడై ఉన్నాడు, శబ్దాలకు అన్నిటికీ శరీరభూతుడై ఉన్నాడు. అకారవాచ్యుడైన భగవానునకు కల కారణత్వపూర్తిని వర్ణించడానికి ఇన్ని పాదాలను శ్రీ వ్యాసుల వారు అనుగ్రహించారు.

జగత్తుకు కారణం బ్రహ్మమని అనేటపుడు ఛాందోగ్యోపనిషత్తులోని సద్విద్యా ప్రకరణంలో శ్వేత కేతువు అనే తన కుమారునకు తండ్రి ఉద్దాలకుడు ఆశ్చర్యకరంగా పలు విషయాలను తెలిపాడు. ఈ ప్రకరణంలోనే **తత్త్వమసి శ్వేతకేతో!** (ఓ శ్వేత కేతూ! నీవే పరమాత్మవై ఉన్నావు) అనే వాక్యం ఉన్నది. **తత్, త్వమ్, అసి - తత్త్వమసి. తత్** - అంటే ఏమి?, **త్వమ్** - అంటే ఏమి? **అసి**- అంటే ఏమి? **తత్త్వమసి** - అంటే ఏమి? అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం - అనే మత భేదాలు ఏర్పడడానికి మూల కారణం ఈ వాక్యమే.

నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళి ఆరంభంలోనే తత్త్వమసి వాక్యార్థాన్ని అనుగ్రహించారు. **నలముడై యవన్** - గుణ విశిష్టం బ్రహ్మం - ఇదే తచ్ఛబ్దార్థం. చిదచిద్విశిష్టమైన బ్రహ్మ **ఆయ్‌నిన్ర** - ఇది అసి శబ్దార్థం. గుణ విశిష్టమైన పరబ్రహ్మానికి, చిదచిద్విశిష్టమైన పరబ్రహ్మానికి అద్వైతం పల్కడం మన సంప్రదాయం. ఛాందోగ్యం వేరు, తిరువాయ్‌మొళి వేరు కాదు. తిరువాయ్‌మొళిని ఛాందోగ్యసమమ్ అని ప్రశంసిస్తారు, మన పూర్వాచార్యులు.

పదవ శతకంలో కూడ **తానే ఉలకెల్లామ్** (జగత్తు అంతా తానే) అని ఈ అర్థాన్ని నమ్మాళ్వార్లు పలికారు. తిరువాయ్‌మొళి మధ్యలో కూడ **యానే నీ** (నేనే నీవు) అని ఆళ్వార్ల వాక్కు.

**సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలాన్** (అన్ని వస్తువులు బ్రహ్మమే, దాని నుండే పుట్టి, జీవించి, దానిలోనే లయమవు తున్నందున) అనేది వేదాంత వాక్యం. **తజ్జ** - బ్రహ్మం నుండి పుడుతున్నది, **తల్ల** - దానిలోనే లయిస్తున్నది, **తదన్** - దానిచే నియమింపబడుతున్నది. ఈ మూడింటిని

కలిపి **తజ్జలాన్** అని వేదాంతం పల్కుతున్నది. దీనినే నమ్మాళ్వార్లు కూడ **తానే ఉలకెల్లామ్ తానే వడైత్తిడన్దు తానే ఉణ్డు మిழ్న్దు తానే యాళ్వానే** (10-5-3) (జగత్తు అంతా తానే. తానే సృష్టించి, కొలిచి, తానే గ్రహించి, వెలువరించి, తానే పాలిస్తున్నాడు) అని అన్నారు. ద్రావిడ పాశుర రూపంలో ఉన్నా, వేదాంతార్థాలను నమ్మాళ్వార్లు విశదీకరించేటట్లుగా ఎవరికీ చేయడానికి సాధ్యం కాదు.

తత్త్వమసి వాక్యార్థాన్ని నిరూపించేటపుడు మన పూర్వాచార్యులు అద్భుతమైన ఒక అర్థాన్ని తెలిపారు. **ఉతతమాదేశమప్రాక్ష్యః యే నా శ్రుతం శ్రుతం భవత్యమతం మతమ్ అవిజ్ఞాతం విజ్ఞాతమ్** (ఛాందో-6-1-3) (దేనిని వింటే వినబడనిది అంతా వినబడినది అవుతుందో, దేనిని భావిస్తే భావించబడనిది అంతా భావింపబడినది అవుతుందో, దేనిని తెలిస్తే తెలియబడనిది అంతా తెలిసినది అవుతుందో, ఆ పరమాత్మను దర్శించావా?) అనేది ప్రతిజ్ఞా వాక్యం.

ఒక విషయాన్ని తెలిస్తే అన్నిటినీ తెలియవచ్చు. అంటే-కారణ విజ్ఞానంతో కార్యవిజ్ఞానం తెలియ వచ్చు. దీనికొక దృష్టాంతాన్ని తెలిపారు. **యథా సౌమ్య! ఏతేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్** (ఛాందోగ్య- 1-4) అనేది ఆదృష్టాంతం - మట్టిని గూర్చి తెలిస్తే ఘటాన్ని తెలియవచ్చు. బంగారాన్ని తెలిస్తే బంగారు నగలను గూర్చి తెలియవచ్చు. ఈ విధంగా, ఒకటి కారణం, ఇంకొకటి కార్యం. ఇక్కడ చెప్పబడిన ప్రతిజ్ఞ, దృష్టాంతం, రెండింటినీ, జగత్తుకు బ్రహ్మానికి మధ్య ఉండే కార్యకారణ భావాన్ని తెలుపకపోతే, చెప్పడం సాధ్యం కాదు.

ఈ విధంగా ప్రతిజ్ఞ, దృష్టాంతం - అని ఛాందోగ్యంలో ఉండే రెండు విషయాలను పురస్కరించుకొని శ్రీభాష్యంలో ఆరంభం నుండి చివరి వరకు పలు వేదాంతార్థాలను మన స్వామి శ్రీరామానుజులు నిరూపించారు.

**ఎమ్బెరుమానార్ దర్శనమ్** అనబడే మన మతం ఉభయ వేదాంత సంప్రదాయం. సంస్కృత వేదాంతం విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని గూర్చి ఉంటుంది. భగవానుని గూర్చి తెలుపడంలో దృష్టి కల్గినది, ఇది. ద్రావిడ వేదాంతం శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని గూర్చి తెల్పుతుంది. ఇది, భగవానుని అనుభవించడంలో దృష్టిని కల్గినది.

అనాది అయినది, పరమ వైదికమైనది అయిన ఈ దర్శనానికి చెందిన వారమైన మనకు మునుముందు భగవానుని గూర్చిన జ్ఞానం కొంత వరకైనా కల్గి ఉండడం అత్యంతావశ్యకం.

భగవానుని గూర్చి తెలుపడంలో దృష్టిని కల్గిన వేద వేదాంతాల యధార్థమైన తాత్పర్యార్థాలను భగవానుడు అనుగ్రహించిన గీతాశాస్త్రాన్ని పురస్కరించుకొని, శ్రీవేదవ్యాస మహర్షి అనుగ్రహించిన శారీరక మీమాంసా శాస్త్రాన్ని పురస్కరించుకొని, మహర్షులు అనుగ్రహించిన పలు గ్రంథాలను పురస్కరించుకొని మనం కొంత వరకు తెలిసికోవాలి.

భగవదనుభవానికి ముందుగా భగవానునకు చెందిన జ్ఞానం కల్గడం అవసరం కనుక, ఇవి మునుముందు మనకు జ్ఞాన ద్రవ్యాలు అవుతున్నాయి. వేద సంప్రదాయంలో స్థిరంగా ఉండి, పరమ వైదికులై, వేదవేద్యుడైన భగవానుని అనుభవించడంలో అభినివేశాన్ని కలవారు, ఆళ్వార్లు. వీరు అనుగ్రహించిన దివ్య సూక్తులన్నీ భగవదనుభవ పరీవాహ రూపాలై ఉంటాయి. మహాచార్యులైన మన పెద్దలు వీటికి అనుగ్రహించిన వ్యాఖ్యానాలను సేవించి, వీటి రసానుభవాన్ని మనం కొంతవరకు పొంది ఉజ్జీవించవచ్చు.

